# గుల్బర్గాలోని గణేశాలయంపై పాకిస్తాన్ జెండా ప్రతిష్ఠాపన కల్లోలంలో ఏడుగురు హతం

— హైద్రాబాద్ ప్రభుత్వ ప్రకటన

హైదరాబాదు, ఆగస్టు 27: ఊళ్లోని ఒకానొక గణేశ దేవాలయంపై పాకిస్థాన్ జెండా ఎగిరిన ఫలితంగా గుల్బర్గాలో ఇవాళ చెలరేగిన కల్లోలాల్లో 7 గురు హతులయి పోయినట్లూ, 19 మంది గాయపడినట్లూ నేటిరాత్రి వెలువడిన హైదరాబాదు ప్రభుత్వ ప్రకటన ఒకటి తెలుపుతున్నది.

...చేరుకొన్నారు. ప్రస్తుతం అక్కడ పరిస్థితి అదుపులోకి వచ్చిందని ఆ ప్రకటన తెలియజేస్తున్నది.

ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుడు మల్లప్ప కొల్లూరు, ప్రదేశ్ కాంగ్రెసు మాజీ కార్యదర్శి జనార్దనరావు దేశాయి, కుమారి పద్మజా నాయుడు గార్లు కూడ సంగతి సందర్భాల సమీక్షకై గుల్బర్గాకు బయలుదేరి వెళ్ళారు.

## సాగర్‌లో ఇంకొక సంఘటన

సికిందరాబాదు, ఆగస్టు 27: అధికారవర్గాలకు ఇవాళ అందిన ఒక వర్త...

...కుమారలాల్ యీ సంగతి తెలియంగానే సాయుధపోలీసు దళాలతో హుటాహుటిని గుల్బర్గాకు బయలుదేరారు. సాయంత్రానికల్లా అక్కడికి...

# ఆర్థిక స్వాతంత్ర్యసాధనలో విద్యార్థులపాత్ర

## శ్రీ వెంకటేశ్వర కళాశాల విద్యార్థుల సంఘంలో శ్రీ అనంతశయనంగారి హితవు

తిరుపతి, ఆగస్టు 27: 'రాజకీయ స్వాతంత్ర్యాన్ని సాధించటానికి ఈ తరం వారు బాధ్యతే వహించారు. భారత ప్రభుత్వం అన్ని విధాలా కృషి చేస్తున్న ఆర్థిక స్వాతంత్ర్య సాధనకు నేటి విద్యార్థులు పూనుకోవాలి" అని శ్రీ వెంకటేశ్వర కళాశాల విద్యార్థుల సంఘాన్ని ఇవాళ్ళ సాయంత్రం ఇక్కడ ప్రారంభిస్తూ లోక్ సభ డిప్యూటీ స్పీకర్ శ్రీ ఎమ్. అనంతశయనం అయ్యంగార్ ప్రబోధించారు. వి. పెద్దరామి రెడ్డిగారు అధ్యక్షత వహించారు.

## ఈనామ్ రైతుల రక్షణ బిల్లు

### శ్రీ రత్నసభాపతి ప్రకటన

కర్నూలు, ఆగస్టు 27: తిరుపతిలో సెప్టెంబరు 3 వ తేదీ జరుగనున్న ఈ మ్మడి సమావేశంలో, ఈనామ్ రైతుల రక్షణబిల్లు 1947 నుంచీ అమలులో వున్నట్లు పరిగణించే నిర్ణయాలు చేయవలసిందని ఆంధ్రకాంగ్రెసు, శాసనసభా...

## కోర్టుధిక్కార నేరారోపణల ఉత్తర్వులు

### మద్రాస్ హైకోర్టు ఫుల్‌బెంచి చే రద్దు

## శ్రీ త్యాగరాయకాలేజి

## బొంబాయిలో కృష్ణ జయంతి ఉత్సవం

...గారు అధ్యక్షత వహించారు. శ్రీ పి. గోవిందకృష్ణయ్య, రాధాకృష్ణ నాయుడు, అప్పల నరసయ్యగార్లు అధ్యక్షులు. బొంబాయిలో తెలుగు బాలబాలికల విద్యావసతులపై ప్రసంగించారు. శ్రీ పి. రామారావుగారు జలతరంగంతోను రంగారావు నాయుడుగారు పోటీలతోను కుమారి వి. పి. కె. నీలా నాయుడు నాట్యప్రదర్శనతోను సభికుల నానందపరిచారు. అల్పాహారవిందు అనంతరం కడప కుని రత్నం నాయుడుగారు వందనము లర్పించారు.

## ఆంధ్ర బాలానందసంఘం వార్షికోత్సవం

ఆంధ్రబాలానంద సంఘం వార్షికోత్సవాలు రేపు 29 వ తేదీ సా 5-30 గం అర్కోవిలియస్ వీధియందలి సెంట్ మేరీస్ హాలులో జరుగుతవి. మద్రాసు ప్రభుత్వ ఆరోగ్యశాఖా మంత్రి శ్రీ ఏ. బి. శెట్టిగారు అధ్యక్షత వహిస్తారు.

# హైద్రాబాద్ ముల్కీ నిబంధనలపై కేంద్ర ప్రభుత్వానికి వివరణ

# దూర ప్రాచ్య దేశాలకు వాణిజ్య రాయబారవర్గం

## ఆంధ్ర వాణిజ్య మండలి కార్యవర్గ నిర్ణయం

తిరుపతి, ఆగస్టు 27: ఆంధ్ర వాణిజ్యమండలి సభ్యులలో కూడిన ఒక వాణిజ్య ప్రతినిధివర్గాన్ని 1955 మార్చిలో జపాన్‌కూ, తదితర దూరప్రాచ్య దేశాలకు పంపటానికి శె. వి. సోమయాజులుగారి అధ్యక్షతన ఇవాళ మధ్యాహ్నం ఇక్కడ తిరుమలలో సమావేశమైన ఆంధ్ర వాణిజ్య మండలి కార్యవర్గ సంఘం నిశ్చయించింది. ప్రస్తుత కార్యాలయంలో ఒక పారిశ్రామిక వస్తు ప్రదర్శనశాలను (మ్యూజియమ్) కూడా తెరవటానికి తీర్మానించారు.

## కర్నూలు జిల్లాలో 'ప్రత్యక్ష చర్య' ప్రారంభం

### 15 మంది అరెస్టు

కర్నూలు, ఆగస్టు 27: ఆంధ్ర రాష్ట్ర కల్లుగీత కార్మిక సంఘంవారు ప్రత్యక్షచర్య నిన్నటినుంచీ కర్నూలు జిల్లాలో ప్రారంభమయింది. ఆరుగురు సానాయి మేళగాండ్రతో తొమ్మిది మంది మాజీ గీతపనివారు ఇక్కడికి 23 మైళ్ళదూరంలో ఉన్న నందికొట్కూరు తాలూకా ...గ్రామానికి సమీపం...

## కరివెన సత్యాగ్రహం

### మరికొంతమంది సత్యాగ్రహులకు శిక్షలు

## మైసూరు విశ్వవిద్యాలయ పట్టప్రదానసభ

## శ్రీ రామమూర్తిగారి స్నాతకోపన్యాసం

## శ్రీ కంఠయ్యగారి రాజీనామా

## రాష్ట్రీయస్వయం సేవక్ శిబిరం

...రాయపిళ్లెగారు అధ్యక్షత వహిస్తారు. ప్రాంత ప్రచారక్ శ్రీ ఏక్నాథ్ ...కర్ గారు ఉపన్యసిస్తారు.

...దొరకలేదని శ్రీమతి శారద అనే విద్యార్థిని మైసూరు హైకోర్టులో రిట్ అర్జీ దాఖలు చేసింది.

## సిమెంట్ అమ్మకం నిబంధనలు

### సవరణ చేస్తూ ఆంధ్ర ప్రభుత్వ ఉత్తర్వు

కర్నూలు, ఆగస్టు 27: ఆంధ్ర ప్రభుత్వానికి సంబంధించిన సిమెంట్ కంట్రోలరుగాని, లేదా ఆంధ్రరాష్ట్రప్రభుత్వ కంట్రోలు వస్తువుల డైరక్టరు అధికారమిచ్చిన ఉద్యోగిగాని ఇచ్చే లైసెన్సులలోని నిబంధనలకు వ్యతిరేకంగా సిమెంటు ఎవరూ విక్రయించరాదు; ఆ నిబంధనలకు విరుద్ధంగా అమ్మకానికి గాను సిమెంటు నెవరూ నిలవ చెయ్యరాదని సిమెంటు అమ్మకం ఉత్తరువులకు ఆంధ్రప్రభుత్వం చేసిన సవరణ ఆదేశిస్తున్నది.

ఆ నిబంధనలకు ప్రభుత్వం చేసిన మరొక సవరణ ననుసరించి ఒకటి కంటే ఎక్కువ ప్రాంతాలలో సిమెంటు వ్యాపారం చేసేవారు ఆయా ప్రాంతాలకు విడివిడిగా లైసెన్సులు తీసుకోవాలి. ఒకే పట్టణంలో లేక ఒకే గ్రామంలో పలుచోట్ల సిమెంటు వ్యాపారం చేస్తున్నా, లేక పలుపట్టణాలలో...

## హత్యానేరానికి యావజ్జీవ శిక్ష

### కడప సెషన్సుజడ్జి తీర్పు

# హరిజనులకు బ్రాహ్మణ బాలికల 'రిజర్వు' అవసరమన్న ప్రసక్తి

## ఉపమంత్రి ప్రకటనపై భోగట్టాను కేంద్రానికి పంపినట్లు అసెంబ్లీలో శ్రీ బిందూ వివరణ

హైదరాబాదు, ఆగస్టు 26: భోపాల్ పర్వీసు ఉపమంత్రి శ్రీ శంకరదేవ్ గారిపై ఐ. పి. సి. 153 ఎ క్లాజు క్రింద దావా వేయుటకు అనుమతి యివ్వవలసిందిగా ఒక పౌరుడు ప్రభుత్వానికి దరఖాస్తు పెట్టుకున్నాడని పి.డి.ఎఫ్. సభ్యుడు శ్రీ బి. వెంకట్రామారావుగారు అడిగిన ప్రశ్నకు సమాధానమిస్తూ శ్రీ దిగంబరరావు బిందు (హోం మంత్రి) నేడు శాసనసభలో చెప్పారు.

...మంది వెనుకబడిన జాతుల విద్యార్థుల స్కాలర్‌షిప్పులకు దరఖాస్తులు పెట్టుకున్నారని చెప్పారు. అందులో 28881 మందికి రూ. 1,38,483 లు మంజూరు చేయబడినట్లుగూడా తెలిపారు.

రాజకీయ పెన్షనులు ఇంతవరకెవ్వరికీ యివ్వలేదనీ, యికముందు యిచ్చే అభిప్రాయం కూడా ప్రభుత్వానికి లేదనీ బిందుగారు శ్రీ అబ్దుర్ రహమాన్ వేసిన ప్రశ్నకు సమాధానంగా...

# రాష్ట్రవార్తలు

## బందరు

పెడన గ్రామములోని శ్రీ ... డిస్ట్రిక్టుబోర్డు పాఠశాల ప్రధానోపాధ్యాయుడు వి. వి. యల్. నరసింహారావుగారు ఏర్పాటుచేసిన ప్రథమచికిత్సా కేంద్రములో తరిఫీదుపొందిన ముస్లిము ఉపాధ్యాయులకు 15 వ తేదీ సాయంకాలము మూసద్దీన్ పేటలోని మునిసిపల్ ముస్లిము బాలికల పాఠశాలలో డాక్టరు పోతరాజు, కోటాచలపతిరావుగారు ఢిల్లీలోని సెంటుజాంబులెన్సు సంఘం వారు యిచ్చిన సర్టిఫికెట్లను ఇచ్చారు.

రామానాయుడుపేటలో శ్రీ ... భొట్ల సుబ్బారావుగారు వారి సతీమణి కమలమ్మగారు నడుపుచున్న శ్రీ త్యాగరాజ సద్గురు సంగీత కళాశాలవారు స్థానిక పురమందిరములో నిన్న స్వాతంత్ర్యదినోత్సవము జరిపారు. శ్రీమతి యల్. టి. రత్నంగారు సభాకోత్సవము చేశారు. శ్రీమతి అయేషా కాదర్ (కలక్టరుగారి సతీమణి) అధ్యక్షతన సభ జరిగింది. జి. శివంతులగారు స్వాతంత్ర్యదినోత్సవ ప్రాముఖ్యతను గురించి ఉపన్యసించినతర్వాత కళాశాల విద్యార్థినులు నాగస్వరము, వీణ, ఫిడేల్, ఫ్లూటు గాత్ర వాయిద్యములతో కచ్చేరి చేశారు.

అధ్యక్షురాలు కళాశాలవారు చేయుచున్న కృషికి సంతోషము వెలిబుచ్చుచూ, ఈ కళాశాలకు బాలాకాలమునుండి వాంఛింపబడిన కళాశాల భవనము సత్వరకాలములోనే సంపాదించ గలదని తెలిపారు. శ్రీమతి కమలమ్మగారి కృతజ్ఞతావందనములతో సభముగిసినది.

## పెదపాడు

## నూజవీడు

## పెడన

## వేలేరు

## పామర్రు

## జగ్గయ్యపేట

## తిరుపతి

## గంటల పంచాంగం

శ్రీ జయ సం॥ భాద్రపద శు॥ ప్రథమ
1954 సం॥ ఆగస్టు 29 ఆదివారం
ఆ॥ ప్రథమ 16-38 పూ ఫ 21-8 వర్జ్యం
రా 4-50 ల.

శు॥ ద్వితీయ ఆగస్టు 30 సోమవారం
పా॥ ద్వితీయ 17-50 ఉ ఫ 22-59
శేవర్జ్యం 6-33 వ.

ఆంధ్రపత్రిక

ఒక రేయుని యీడరించిన వరవని
యుప్రియము తన సుకంబున తగు దా
జౌదులకు వచిపెదుకునని వేదాయుఖము
వరమధర్మ వరము లెల్లన్-(మహాభారతము)

శ్రీ జయ సం॥ భాద్రపద శు॥ ప్రథమ
ఆదివారం

## విశాలాంధ్ర

విశాలాంధ్ర విషయమై ఆంధ్రరాష్ట్ర ఉపముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డిగారు హైద్రాబాదు మంత్రులు రంగారెడ్డి, చెన్నారెడ్డిగార్లతో సంప్రతింపులు జరుపుతున్నారు. ఆంధ్ర-హైద్రాబాదు మంత్రులు విశాలాంధ్ర విషయం చర్చలు జరపడం ఇదే మొదలు. అధికార స్థాయిలో సంప్రతింపులను ప్రారంభించినందుకు ఉపముఖ్యమంత్రి అభినందనీయుడు. ఈ సంప్రతింపులవల్ల విశాలాంధ్ర స్థాపనకు కొన్నివర్గాల్లో ఏర్పడిన ప్రాతికూల్యం తొలగదు. కాని సమగ్ర సంప్రతింపులను ప్రారంభించి ముఖ్యులందరూ సమావేశమై అవరోధాలను తొలగించడానికి కృషి చేయ అనుకూలమైన పరిస్థితులు ఇప్పటి ఇష్టాగోష్ఠి చర్చలవల్ల ఏర్పడగలవు.

ఆంధ్ర, హైదరాబాదు ఆంధ్ర నాయకులు ఫజల్అలీ కమిషనుకు నివేదికలను సమర్పించడానికి పూర్వం ఇట్టి సంప్రతింపులు జరిగియుండిన ఎక్కువ ప్రయోజనకరంగా వుండేది. ప్రత్యేక తెలంగాణా రాష్ట్రం కావాలని కొందరు కోరడం జరిగివుండేదిగాదు. ఆంధ్ర కాంగ్రెస్ నాయకులు గాని, ఆంధ్ర మంత్రులుగాని విషయంలో శరిగ్గా శ్రద్ధ తీసుకొని యుండనందున విశాలాంధ్ర స్థాపన ఒక సమస్యగా తయారైనది.

ఆంధ్ర ప్రభుత్వ కార్యాలయాలను హైద్రాబాదులో ఏర్పాటు చేసుకుంటామని ప్రకటనలు చేసిన ఆంధ్ర నాయకులు, ఆ ప్రకటనలు చేయడం మించి ఏమీ చేయలేదు. హైద్రాబాద్‌లో జరిగిన విశాలాంధ్ర మహాసభకు హాజరైన ఆంధ్ర మంత్రులు తెలంగాణా వారి సుహృద్భావాన్ని సంపాదించడానికి ప్రయత్నించ లేదు. కాగా హైద్రాబాద్ మంత్రులను విమర్శించి అంతవరకూ వున్న సద్భావాన్ని పూర్తిగా నిర్మూలించారు. రాయలసీమ వారు శ్రీబాగు ఒడంబడికను పొందినట్లు తెలంగాణా వారు ఒక ఒడంబడికను పొందటానికి ప్రయత్నించరాదని చెప్పి ప్రజలలో ఆంధ్రుల చిత్తశుద్ధిపై అనుమానాలను కల్గించారు. వాటన్నింటికి తోడుగా ఇటీవల తెలంగాణా సుహృద్భావ రాయబారవర్గం ఆంధ్ర పట్నాలకు సందర్శించినప్పుడు కొందరు ఆంధ్ర నాయకులు 'హైదరాబాద్ నాయకుల ప్రస్తుత పదవులకు, అధికారాలకు భంగం రావని హామీ ఇస్తున్నాం' అంటూ హైద్రాబాద్ నాయకుల పదవీ వ్యామోహం, అధికార కాంక్ష విశాలాంధ్రకు ఆటంకాలైనట్లు చిత్రించి వారికి బాధ కల్గించారు.

విశాలాంధ్ర ఇటు ఆంధ్ర రాష్ట్రానికి, అటు తెలంగాణాకు కూడా అవసరము, ప్రయోజనకరము, లాభదాయకము అని నిరూపించవలసిన అగత్యం లేదు. హైద్రాబాద్ నగర భవిష్యత్తులో నిమిత్తం లేకుండా ఆంధ్ర నాయకులు విశాలాంధ్రకు కృషి చేయుడం అవసరం. హైద్రాబాదు - సికింద్రాబాదు నగరములను బొంబాయివలె యూనియన్ ప్రాంతములుగా ప్రకటించాలనే ఆలోచన కేంద్ర ప్రభుత్వానికి ఉన్నట్లు ఇటీవల వార్తలు వెలువడినవి. హైద్రాబాదు - సికింద్రాబాదులను కేంద్రప్రభుత్వపరం కాకుండా చూచుకోవడం అవసరమే. కాని హైద్రాబాద్ రాజధానిగా వుపయోగపడగలదనే ఆశతో ఆంధ్రనాయకులు విశాలాంధ్రను కోరుచున్నారనే అపోహ కొందరిలో వున్నందువలన ఆ అపోహను తొలగించవలసిన బాధ్యత ఆంధ్ర నాయకులపై వున్నది.

హైద్రాబాదు విధాన సభ, విశాలాంధ్ర స్థాపన విషయంలో ఆ రాష్ట్ర అసెంబ్లి ఒక అనధికార తీర్మానాన్ని చర్చించవలసి వున్నది. ఆ తీర్మానంపై తమ అభిప్రాయానుగుణంగా వోటు చేయడానికి స్వేచ్ఛ నివ్వమని కాంగ్రెసుపార్టీ సభ్యులలో సగం మందికిపైగా పార్టీ నాయకుని కోరారు. కాని అట్టి స్వేచ్ఛను ఇవ్వడానికి నాయకుడు రామకృష్ణరావుగారు నిరాకరించారు. ఆంధ్రరాష్ట్ర రాజధాని విషయంలో కాంగ్రెస్ పక్ష నాయకుడు ఎలా వ్యవహరించారో ఈ విషయంలో రామకృష్ణరావుగారు అలాగే ప్రవర్తించారు. ఆనాడు శ్రీ సంజీవరెడ్డిగారి ప్రవర్తనను హర్షించ లేదు. ఈనాడు రామకృష్ణరావుగారి నిర్ణయాన్ని హర్షించడం లేదు.

విశాలాంధ్ర సమస్య ఈ విధమైన వోట్లద్వారా పరిష్కారమయ్యేది గాదు. ఇది ఒక్క కాంగ్రెస్ పార్టీకి సంబంధించిన విషయం గాదు. కనుకనే మేము మొదట్నుంచీ ఆంధ్ర, తెలంగాణా ప్రజా ప్రతినిధులందరూ సమావేశమై ఈ వ్యవహారాన్ని సమగ్రంగా చర్చించి పరిష్కరించుకోవాలని సూచిస్తు వచ్చాము. ఇప్పటికీ మా అభిప్రాయం అదే. ఆంధ్ర, తెలంగాణా సభ్యులందరూ పార్టీలతో నిమిత్తం లేకుండా సమావేశమై ఒక నిర్ణయానికి రావడం అవసరం. అట్టి సమావేశాన్ని ఏర్పాటు చేయడానికి గల అవకాశాలను వెంటనే పరిశీలించాలి. ప్రస్తుతం హైద్రాబాద్‌లో జరుగుచున్న సంప్రతింపులలో ఈ విషయం విచారణకు రాగలదని ఇందుపై నిర్ణయం జరగగలదని ఆశిస్తున్నాము.

## అమ్మకంపన్ను అప్పీల్సు ట్రిబ్యునల్
### ఈనెల 30 నుంచి గుంటూరులో ఏర్పాటు

మద్రాసు, ఆగస్టు 28: ఆంధ్ర ప్రభుత్వమువారు ఆంధ్ర అమ్మకాల పన్ను అప్పీల్సు ట్రిబ్యునల్ ఆఫీసును మదరాసునుండి గుంటూరుకు మార్పుటకు నిశ్చయించినందున మదరాసు త్యాగరాయనగరు గోపతి నారాయణ స్వామిరోడ్డు నెం 60 గృహంలోగల ట్రిబ్యునలు కార్యాలయం రేపు 29 వ తేదీ మధ్యాహ్నం మదరాసులో పనిని మూసివేసి, ఆగస్టు 30 వ తేదీ ఉదయం గుంటూరు కన్నవారితోట యందు నెం 98 గృహమున పనిచేయుటకు [illegible]

## మన రాజకీయాలు:
# ఆంధ్రనగరాల అభివృద్ధికి పురపాలకసంఘాలే ఆటంకం

(ఒక ప్రత్యేక రాజకీయ విలేఖరి)

మంచినీరు లభించక, మురుగునీరు పోక మన పట్నాలు మురికికూపాలుగా తయారైనవి. వాటిని పాలించడమే తమ కర్తవ్యంగా భావిస్తున్నారు పురపాలక సంఘాల సభ్యులు, అధ్యక్షులు. పురపాలక సంఘాలు మారినవి. పరములు మాత్రం ప్రకృతిని కూడా ప్రతిఘటించి వాటి వికృతాకారాన్ని ఇంతవరకూ నిలబెట్టుకుంటున్నవి. పురజనులు పురజనకులు (సిటీ ఫాదర్సు) మారిపోయినారు. పురవీధులు, పుర స్వరూప స్వభావాలు వాటిపై అధికారం చలాయించినవారికి స్మారక చిహ్నాలుగా వుండిపోయినవి. పట్నాల ఆకారం వృద్ధి అవుతున్నది. పోషణ లేనందువల్ల అందవికారంగా తయారైనవి.

రాష్ట్ర తాత్కాలిక రాజధానిని ఎక్కడ ఏర్పాటుచేసుకోవాలి అన్న ప్రశ్నరాగా, అన్ని హంగులూ, అన్ని సౌకర్యాలు కలిగివున్న పట్నం మనకు పదకొండు జిల్లాల్లోనూ ఒక్కటి కూడా కన్పించలేదు. ఈ పరిస్థితికి విచారపడినవారు ఒక్కరూ లేరు. "తాత్కాలిక రాజధానిని ఏర్పరచుకోవడానికి మా రాష్ట్రంలో ఒక్క పట్నం కూడా లేదు. కనుక శాశ్వత రాజధానిని నిర్మించుకునే పర్యంతం రాష్ట్రరాజధానిని మద్రాసులోనే వుంచాలని కోరాం. అప్పట్లో ఆ కోరిక బాగానే వుంది.

### మన పట్నాలు

మన కోర్కెమన్నింపబడ లేదు. వున్న పట్నాల్లోనే ఏ పట్నం పనికి వస్తుందా అని ఆలోచించ నారంభించాం. విశాఖపట్నం నిండా పెద్దపెద్ద భవనాలున్నవి. మద్రాసుకు వున్నట్లే సముద్రం వుంది. కనుక విశాఖపట్నం తాత్కాలిక రాజధానికి అన్నివిధాలా అనుకూలం అనుకున్నాం. కాని విశాఖపట్నానికి మంచినీరు సప్లయి ఎలా వున్నది? మురుగునీరు పారుదల సౌకర్యాలు ఎంతమాత్రంగా వున్నవి? వీధులు రాకపోకలకు ఎంతవరకు అనుకూలంగా వున్నవి? పట్టణ పారిశుధ్యం ఎంతవరకు అంటువ్యాధుల వ్యాప్తిని నిరోధించగల స్థితిలో వున్నది? జనాభా పెరుగుదలవల్ల ఏర్పడే క్రొత్త సమస్యల పరిష్కరింపగల శక్తి ఎంత వున్నది? మొదలైన విషయాలను విచారించినవారే లేరు. ఖాళీ భవనాలున్నవి గనుక తాత్కాలిక రాజధానిని అక్కడ పెట్టుకోవచ్చుననే న్యాయమూర్తి వాంఛూగారు మొదలు నీలం సంజీవరెడ్డిగారి వరకు అందరూ అన్నారు.

### విజయవాడ పరిస్థితి

విజయవాడ విషయం విచారణకు రాగా ఎవరెంత చెప్పినా ఆ పట్నం రాష్ట్రంలోని అన్ని ప్రాంతాలకూ అందుబాటులో వుందనేది వాస్తవమే. అందరికీ అందుబాటులో వున్నందువల్ల అందరూ వస్తారు. వచ్చినవారు వుండటానికి పట్నంలోగల వసతులు ఏమిటో ఎవరూ వివరించలేదు. ప్రభుత్వ కార్యాలయాలు పెట్టుకోవడానికి విజయవాడలో భవనాలు లేకపోతే, విజయవాడ సమీపంలో నూజివీడులో భవనాలున్నవన్నారు. త్రాగడానికి నీరుండా అంటే, పట్నం ప్రక్కనే కృష్ణవేణమ్మ వుందన్నారు. అంతే గాని పట్నంలో వాసయోగ్యమైన ప్రాంతం యెంత? మురుగునీరు పారుదలకు గల సౌకర్యాలేమిటి? కార్లు రానూ, పోనూ వీధులు యెంత విశాలంగా వున్నవి? రోడ్లు ఎంత చదునుగా వున్నవి? కాల్వగట్లనున్న పాకలు నగర సౌందర్యాన్ని యెంతగా ఇనుమడింప చేస్తున్నది? కాల్వగట్లనుంచి బయల్దేరే దుర్గంధానికి విరుగుడేమైనా వున్నదా? వీధుల నాక్రమించిన దుకాణాలు రాకపోకలకు యెంత సౌకర్యంగా వున్నవి? పట్నాన్ని బాగుచేస్తే విజయవాడ 'వెన్నిస్' లాగా వుంటుందని మురిసిపోయినవారే గాని, బాగుచేయడానికి గల ప్రతిబంధకాలను ఎవరైనా విచారించారా? పట్టణం వృద్ధి కావడానికి చాలా అవకాశాలున్నవి. చుట్టూ ఖాళీ స్థలాలు కావాల్సినంతగా వున్నవి. వున్న వూరునే అభివృద్ధి చేయడం సాధ్యంగానప్పుడు, వూరు పెరిగిపోతూ వ్యవహారం చేయడం పురపాలకసంఘానికి సాధ్యమౌతుందా? ఈ విషయాలను విచారించినవారే లేరు.

### హైకోర్టు కార్యస్థానం గుంటూరు

గుంటూరు విషయం వచ్చేసరికి అందరూ కుతూహలంగానే వున్నట్లు కన్పించారు. రాష్ట్రంలోని అన్ని ప్రాంతాలకు అందుబాటులో వున్న విజయవాడకు గుంటూరు చాలా అందుబాటులో వుంది గనుక, గుంటూరు కూడా అందరికీ అందుబాటులో వున్నట్లే అన్నారు. కృష్ణవిూద రోడ్డు బ్రిడ్జి పడితే గుంటూరు-విజయవాడ ఏకమై పోతవి గనుక రాజధానికి విజయవాడ ఎంత అనుకూలమో గుంటూరూ అంత అనుకూలమే అన్నారు. [illegible] గుంటూరు పెరిగినంతగా ఆంధ్ర దేశంలో మరే పట్నమూ పెరగలేదన్నారు. గుంటూరు కలెక్టరు కార్యాలయ భవనం అంత భవనం రాష్ట్రం మొత్తంమీద మరెక్కడా లేదన్నారు. పట్నం చతుర్ముఖంగా పెరగడానికి అవకాశాలున్నవన్నారు. అన్నీ నిజమే. మరి త్రాగడానికి నీరే లేదు. స్నానపానాదులకు నీరు లేనప్పుడు మురుగునీరు పారుదల సమస్యే వుండక పోవచ్చును! రాతినేల కనుక ప్రత్యేకం రోడ్లు వేయవలసిన పని వుండక పోవచ్చును. ఎర్రమన్ను గనుక కంకర వేయడం అన్న సమస్యే వుండదు. వీటన్నింటిని మించి యుద్ధ కాలంలో ఆంధ్ర విశ్వకళా పరిషత్తునే ధరించిన గుంటూరు తాత్కాలిక రాజధానిని ధరించలేక పోతుందా అనుకున్నారు. కాని అంతవరకూ మలేరియా అంటే ఏమో ఎరుగని గుంటూరు మలేరియాకు ఆలవాలమైంది. అయితే ఇప్పుడు వైద్యకళాశాలవున్నది. గనుక మలేరియా చికిత్సకు సౌకర్యాలు యేర్పడి వుండవచ్చును. మంచినీరు సప్లయి ఒక పెద్ద సమస్యగా పరిణమిస్తుందని అక్కడ హైకోర్టు ఏర్పడే వరకూ ఎవరూ అనుకోలేదు! దుమ్ములేని రోడ్లు అవసరమని ఎవ్వరూ భావించలేదు. జుట్టులేని తలల్లాగా, దుమ్ములేని రోడ్లేమిటి అని అనుకున్నవారు కూడా కొందరు లేకపోలేదు. ఈనాడు గుంటూరులో బాగా పెరిగినవి ఇండ్ల అద్దెలు. బాగా తరిగినవి సాధారణ సౌకర్యాలు. రోడ్లకు మరమ్మతులు లేవు. పంపులు వేయడానికి గోతులు తీశారుగాని పంపులు రాలేదు. ఇంట్లో వాళ్ళ మీద అలిగి ఇంటాయినో, ఇంటావిడో పడ్డానికి మాత్రం ఉపయోగంగా వున్నవి. విద్యుచ్ఛక్తి సప్లయి చాలా లీడగా వున్నది. పురజనులకు చావాలూ, అధికార్ల బదిలీల గురించి తీర్మానాలు చేయడంతో సరిపోతున్నది. ఇతర విషయాలను గురించి విచారించడానికి టైము లేదు.

అయినా వీరికి ఆత్మాభిమానం ఎక్కువ, ఆత్మగౌరవం కంటే. యీ విషయంలో అన్ని పురపాలకసంఘాలూ సమస్థాయిలోనే వున్నవి. ఒక పట్నం తక్కువా లేదు, మరొక పట్నం ఎక్కువా లేదు.

### తుంగభద్రానది వొడ్డున రాజధాని

ఈమూడు పట్నాల యోగ్యతాయోగ్యతలను విచారించిన విూదట ప్రకాశంపంతులుగారు, తుంగభద్ర వొడ్డునవున్నదని, హైద్రాబాదుకు దగ్గరగావున్నదనీ, కర్నూలును తాత్కాలిక రాజధానిగా నిర్ణయించారు. పురపాలకసంఘంవారు, రాష్ట్రాన్ని కాకపోయినా, రాష్ట్రరాజధానిని పాలిస్తున్నామనే భావంతో వ్యవహరిస్తూ వచ్చారు. కమీషనరుతోనూ, ప్రభుత్వంతోనూ వివాదం పడడంతోనే వీరికి సరిపోతున్నది. ఎవరు ఏ పని చెప్పినా వీరు ప్రభుత్వంపై ఫిర్యాదు చేయడంతో తమ బాధ్యత తీరిపోతున్నట్లు భావిస్తున్నారు. ప్రభుత్వం పనిచేయలేదని విమర్శించడానికో, లేక ప్రభుత్వం ఫలానాపని చేయడానికి కొన్ని లక్షలరూపాయలను గ్రాంటుగా ఇవ్వాలని కోరడానికో మాత్రమే ఈ పురపాలకసంఘాలు సమావేశమౌతున్నవి.

### మంత్రివర్గ ఆలోచన

రాష్ట్ర మంత్రివర్గం యీ మూడు పురపాలకసంఘాలనూ రద్దు చేసి, ప్రత్యేక అధికారులను నియమించడం గురించి ఆలోచిస్తున్నది. రద్దు చేయడానికి ఇంత ఆలోచన ఎందుకో బోధపడదు. విజయవాడ పురపాలక సంఘాన్ని ఏనాడో రద్దుచేసియుండవలసింది. దావాలు రిట్లతో నిలబడుతున్న ఈపురపాలక సంఘంవల్ల పట్నానికి ఈషన్మాత్రమూ ప్రయోజనం వుండదు. పురపాలక సంఘసభ్యులలో ఎవరికో కుష్ఠువ్యాధి వున్నదని నిరూపించడానికి నానాఅవస్థాపడ్డ ఛైర్మనుగారికి తమ ఆధీనంలోవున్న పట్నంస్థితి ఎలా వుందో తెలిసినట్లులేదు. తెలుసుకోవడానికి వారు ప్రయత్నించనూ లేదు. అమెరికా వెళ్లడానికి ప్యాస్‌పోర్టు రానందుకు వారు పడినబాధ, ఆవేదనలో, విజయవాడ పారిశుధ్యం, రహదారుల మరమ్మతుసురించి, సగం ఆందోళన చెందితే పట్నం కొంతైనా బాగుపడి వుండేది.

పట్నం అభివృద్ధికి ఎవరు విమాచనలు చేసినా వాటివల్ల ప్రయోజనం వుండదని చెప్పడానికే ముందుకు వస్తారే గాని వాట్ని అమలు చేయడానికి ఎన్నడూ ఆలోచించరు. విజయవాడను ఆదర్శనగరంగా రూపొందించడానికి స్థానిక సంస్థల ఇన్స్పెక్టరు రాఘవరెడ్డిగారొక ప్రణాళికను ప్రతిపాదిస్తే, ప్రణాళిక ఎందుకు పనికి రాదన్నారు. రావలసినపన్నులు వసూలు చేసుకోగల సామర్థ్యం లేనప్పుడు [illegible]

విస్తారం పబబుగాడు. కాల్వకట్టల మీద పందల కొద్దీ పలసిన గుడిసెలను తీసివేయడానికి డబ్బు కావాలా? అసలు వాట్ని ముందుగానే నివారించలేక పోయినారా? రోడ్లలో పడ్డ గోతులను పూడ్చడానికి కావలసింది కంకరేకదా! గోతుల్ని డబ్బుతో పూడ్చరుగదా? అయినా ఇంత పెద్ద పట్నంలోనూ చెప్పుకోతగిన రోడ్డు ఒక్కటి లేదు!

### ఛైర్మన్‌గారి 'అసహాయోద్యమం'

ఇవన్నీ ఇలా వుండగా పురప్రముఖులలో పట్టణాభివృద్ధి విషయంలో ఆసక్తి కల్గించడానికి పురప్రముఖుల సమావేశాన్ని ఏర్పాటు చేయమని రాఘవరెడ్డిగారు సూచిస్తే, ఆ సమావేశంవల్ల ఏమీ ప్రయోజనం వుండదని శెలవిచ్చారు ఛైర్మన్ గారు! కనీసం పురపాలకసంఘ సమావేశం కంటె సాఫీగా సక్రమంగా అయినా జరుగుతుందిగదా! అయితే పురప్రముఖులందరూ సమావేశమైతే పురపాలక సంఘంపోను ఎక్కడ వచ్చిన విపాద పరిస్థితి ఏర్పడుతుంది. అందుకు ఏ ఛైర్మన్ అంగీకరిస్తాడు?

ఏమైనా, ఆంధ్రనగరాలు అభివృద్ధి కావాలంటే, ప్రజలు నిజంగా పౌరులు కావాలంటే సర్ మీర్జా బెంగుళూరులో చేసినట్లు చేయకతప్పదు. పట్నాల కళ్మలానికి పురపాలకసంఘ రాజకీయాల కళ్మలంతోడయ్యేసరికి మన పట్నాలు దుర్గంధభూయిష్టమై, విషవ్యాధుల కాలవాలమై, క్షణం ఉండడానికి వీలుగా కుండా వున్నవి. పట్నాల సంస్కరణ వెంటనే ప్రారంభం కావాలి. రాజధాని, కర్నూలు, హైకోర్టు కార్యస్థానం గుంటూరు, రాష్ట్రకేంద్రం విజయవాడలలో యీ పని ప్రారంభం కావాలి.

ఈ పని ప్రారంభం కావడానికి అయిదేండ్లపాటు ఈ పురపాలక సంఘాలను రద్దుచేయాలి. కఠినంగా, కర్తవ్యమెరిగి, నిర్మొగమోటంగా వ్యవహరింపగల అధికారులను నియమించాలి. అట్టి అధికారులు లేనప్పుడు, అసమర్థులైనవారు యీ పనికి నియోగింపబడిన సమష్టి దుష్పరిపాలన పోయి వ్యక్తి దుష్పరిపాలన ఏర్పడుతుంది. పట్నాలు ఇప్పటిలాగానే వుంటవి.

## చేనేత పరిశ్రమ పట్ల ప్రభుత్వశ్రద్ధ
### లోకసభలో శ్రీ కృష్ణమాచారి వివరణ

న్యూఢిల్లీ, ఆగస్టు 27: చేనేతపరిశ్రమను రక్షించటానికీ, బలపర్చటానికీ, ప్రభుత్వం తాము చేయగలిగిందంతా చేస్తున్నారని వాణిజ్యమంత్రి టి. టి. కృష్ణమాచారి ఇవ్వాళ లోకసభలో అన్నారు.

హైదరాబాదు సభ్యుడు శివమూర్తి స్వామిగారు క్రితం సమావేశంలో ప్రతిపాదించిన అనధికార తీర్మానం నేడు తిరిగి చర్చకు వచ్చింది. చీరెలు, ధోవతుల ఉత్పత్తి పూర్తిగా చేనేతకే కేటాయించాలని ఈతీర్మానం కోరుతున్నది. వి. వీరాస్వామి, కె. ఎస్. రాఘవాచారిగార్లు తీర్మానాన్ని బలపరుస్తూ మాట్లాడారు.

కృష్ణమాచారిగారు చర్చలో కలుగజేసుకొంటూ, మన లెక్కలన్నీ తప్పే కనుక లక్షలాది చేనేత కుటుంబాలు బాధపడుతున్నాయనటంలో అర్థం లేదన్నారు. అయితే, ఈపరిశ్రమపై ఆధారపడి వున్నవారి సంఖ్య చాలా వున్నదనటంలో సందేహంలేదనీ, వారు స్వతహాగా స్థిమితంలేని వృత్తిని జీవనాధారం చేసుకొనివున్నారనీ అయన న్నారు. మిల్లులు వాటికి నిర్ణయించిన కోటాను మించి ఉత్పత్తి చేయకుండా చూసే ఏర్పాటువల్లా ప్రజలలోవచ్చిన మార్పువల్లా జాలైనెలలో ధోవతుల ఉత్పత్తి చాలా తృప్తికరంగా జరిగిందని ప్రభుత్వ అభిప్రాయమన్నారు. ఈ పరిశ్రమకు నిరుడు ఆర్థికమంత్రి రెండు కోట్ల రూపాయలు మంజూరు చేయటం తనకు పూర్తి తృప్తి కలిగించిందన్నారు. చాలాచోట్ల నేతవారికి ఋణాలు, గ్రాంట్లు ఇవ్వబడినవనీ వారిని సహకార సంఘాలలోకి తీసుకురావటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయనీ అన్నారు. వీటన్నింటికీ మించి ఈ సమస్యను శాశ్వతంగా పరిష్కరించివేసే వుద్దేశంతో కొనుంగో కమిటీని వేయటమయిందనీ, ఈసమావేశం ముగిసేలోగానే వారి నివేదికను సభవారికి సమర్పింపగల మనుకొంటున్నామనీ, కనుక తీర్మానం అనవసరమనీ, అన్నారు.

శివమూర్తిస్వామిగారు చర్చకు సమాధాన మివ్వాక తీర్మానాన్ని ఓటుకు పెట్టగా వీగిపోయింది.

# జిల్లాబోర్డుల స్థానే ప్రత్యామ్నాయ వ్యవస్థలు
### మంత్రివర్గ సమావేశంలో పరిశీలన

కర్నూలు, ఆగస్టు 27: ఈ నెల 25 వ తేదీన రాజధానిలో జరిగిన సమావేశంలో జిల్లాబోర్డులకు బదులు నెలకొల్పవలసిన పరిపాలనా నిర్వహణ వ్యవస్థలనుగురించి మంత్రివర్గం పరిశీలించింది కాని ఎట్టి నిర్ణయానికీ రాలేక పోయింది. మంత్రివర్గంలోని కాంగ్రెసుపార్టీ ప్రతినిధులకుగాని, స్థానిక పరిపాలనా శాఖ మంత్రికీ మంత్రివర్గంలోని కాంగ్రెసుపార్టీ ప్రతినిధులకుగాని ఈ విషయంలో ఏకాభిప్రాయం లేదని విశ్వసనీయంగా తెలిసింది. అదీకాక ఆనాటి మంత్రివర్గ సమావేశానికి ఆర్థిక, న్యాయశాఖల మంత్రి విశ్వనాథంగారు హాజరుకా లేదు.

కాంగ్రెసుపార్టీ ప్రతినిధులు యీ సమస్యను ఇంకా బాగా పరిశీలించి తమ వైఖరి నిర్ణయించుకొనడానికి వ్యవధి లభించేందుకు వీలుగా ఆ సమావేశంలో ఈ సమస్యను అప్పటికి వాయిదా వేశారు.

శ్రీ వెంకటేశ్వర విశ్వకళాపరిషత్ ప్రారంభోత్సవానికి కాంగ్రెసుపార్టీ సభ్యులందరూ తిరుపతి వస్తారు. కనుక ఈ సమస్యను పరిశీలించేందుకు గాను శాసనసభా కాంగ్రెసుపార్టీ తిరుపతిలో ఆ సందర్భంలో సమావేశమవుతుంది.

ఆర్థికమంత్రి విశ్వనాథంగారు కూడా విశాఖపట్టణంనుంచి సెప్టెంబరు రెండవతేదీన తిరిగి వస్తారని కొంటున్నారు. కనుక తిరుపతిలో ఈ సమస్యను శాసనసభా కాంగ్రెసుపార్టీ పరిశీలించే సందర్భంలో ఆయన సలహా కూడా లభించే అవకాశం కన్పిస్తున్నది.

## ఉత్తరాఫ్రికాలో మెండెస్ విధానం
### ఫ్రెంచి పార్లమెంటు ఆమోదం

పారిస్, ఆగస్టు 27: ఫ్రెంచి పార్లమెంటు నేడు మెండీస్ ఫ్రాన్స్ ప్రభుత్వం ఉత్తర ఆఫ్రికా విధానాన్ని 451-122 ఓట్లతో ఆమోదించింది.

ఈసందర్భంలో జరిగిన చర్చలో ఫ్రెంచి ట్యునీషియా మొరాకోమంత్రి ఎం. పాప్తీ, నియోదస్తూర్ పార్టీని తాము గుర్తిస్తున్నట్లు పేర్కొన్నారు.

ఆయన ఇంకా ఏమి చెప్పారంటే ఫ్రాన్సుకు ట్యునీషియాను, మొరాకోనువదలి ఎన్నడూపోదు. ఈరెండు ప్రాంతాలలోనూ శాశ్వతంగా సైన్యాలను ఉంచుతుంది. ట్యునీషియా విదేశీ వ్యవహారాలు ఫ్రాన్సు చేతుల్లోనే వుంటాయి.

### మొరాకోకు ప్రజాస్వామ్యంలో శిక్షణ

ప్రధాని మెండీస్ ఫ్రాన్సు యీ సభలో మొరాకోను గురించి మాట్లాడారు. యీప్రాంతంలో తాముకొన్ని రాజకీయ సాంఘిక సంస్కరణలను ప్రవేశపెట్టనున్నామని, పూర్వం పదభ్రష్టుడ్ని చేసిన సుల్తాన్ మహామ్మద్ బిన్ యూసఫ్ మొరాకోలో తిరిగి పదవీస్థితుణ్ణి చెయ్యాలంటూ జరగదని మొరాకోలో అన్ని సంస్కరణలు ప్రస్తుతం సుల్తాను మౌల్వీ మహమ్మద్ బిన్ అరఫా అనుమతితోనే జరగవలసి వుంటాయని తెలియజేశారు. మొరాకోవారు ఇంకా ప్రజాస్వామ్యాన్ని గురించి శిక్షణ పొందవలసివున్నదని కూడా ఆయన యీసందర్భంలో వక్కాణించారు.

# 'మనం ఒకరికి నీతులు చెప్పం; మనకు ఇతరులు బోధిస్తే దాన్ని సహించం'

## విదేశాంగ విధానంపై రాజ్యసభ చర్చకు నెహ్రూ సమాధానం
### ఆసియాలోగాని, మరెక్కడగాని నాయకత్వం వహించాలనే వాంఛ లేదని పునరుద్ఘాటన

న్యూఢిల్లీ, ఆగస్టు 27: ఇతరులకు నీతులు బోధించాలనిగానీ, ఆసియాకు లేదా మరే రాజ్యాల బృందానికి నాయకత్వం వహించాలనిగానీ భారతదేశానికి ఎంతమాత్రం లేదని ప్రధానమంత్రి నెహ్రూ ఇవ్వాళ రాజ్యసభలో అన్నారు.

విదేశాంగ విధానంపై చర్చకు సమాధానమిస్తూ ఆయన ఇతరులు ఇట్లా నీతులు బోధించటాన్ని సహింపజాలని తామే ఆ పని చేయటాన్ని ఇతరులు హర్షిస్తారని ఎట్లా అనుకొంటామన్నారు. మనలోటుపాట్లేమిటో తమకు బాగా తెలుసునన్నారు. మనం ఆసియా నాయకత్వం కోరటంలేదనేది ఏదో మర్యాదకోసం అనేమాట కాదని ఆ ఉద్దేశంతో బయలుదేరటం చాలా తప్పు అని తమ అభిప్రాయమనీ అంటూ మనలో గుణం ఏమైనా వుంటే దాని విలువ దానికుంటుందన్నారు.

"ఇండోచైనా, కొరియా, గోవా, ఆఫ్రికా-ఏవిషయం గానీయండి భారతదేశం ఏమి చేసినా జాగ్రత్తగా ఆలోచించి చేయాలి. మనం కోరేదాని ని గురించి తీవ్రమయిన అభిప్రాయాలను వెల్లడించటం తేలిక. కాని అందువల్ల లాభ మేమీ వుండదు. ప్రతికూల పక్షులలో కొందరు ఎప్పుడూ ప్రభుత్వం బ్రిటనంటే భయపడుతోందంటూ, మలయా, కెన్యా మొదలైనవాటిని చూపుతున్నారు. మనకు ఎవరన్నా భయంలేదు, కాని చిక్కులు కలిగించే తప్పటడుగు వేయటమంటే మాత్రమే భయపడతాము. ఆయా విషయాలను ఇట్లా చూసి, నిగ్రహం లేకుండా మాట్లాడే బదులు ఏదో ఒకటి సాధించేందుకూ, ప్రపంచంలో వాతావరణాన్ని మెరుగొనర్చేందుకూ వైషమ్యాలను తగ్గించేందుకూ ఉపకరించేటట్లు వ్యవహరించాలి.

గోవా వ్యవహారాన్ని కూడా ఈ దృష్టితోనే పరికించాలి. ఇది చిన్న సమస్య. అక్కడికిపోయే వారెవరినీ ఆపరాదనే నాకు అనిపించింది. అసలు ఒక జెండా చేత పుచ్చుకొని స్వయంగా గోవాలో ప్రవేశిద్దామని కూడా అనిపించింది.

గోవా విషయంలో ప్రభుత్వం ఎప్పుడు ఏ చర్యలు తీసుకొంటుందో ఇప్పుడు నేను చెప్పలేను. అది అనేక విషయాలమీద ఆధారపడి వుంటుంది. అయితే ఈ చర్యలను నిర్ణయించటంలో ఎప్పుడూకూడా, కోపతాపాలకు వశులమై మనం చేసే చర్యలవల్ల చిక్కులలో పడకుండానూ, ఇతరులు పన్నిన వలలో పడకుండానూ జాగ్రత్త పడతాము. పోర్చుగల్ గోవాలో తన సేనలను పెంచుకోవటము, భారతదేశానికి వ్యతిరేకంగా విపరీత ప్రచారం చేయటమూ ఇదంతా మనల్ని తప్పుదారిని పెట్టేందుకు ఉద్దేశించిందే. పోర్చుగల్ గోవాకు 2 వేలు, 5 వేలు కాదు 20 వేల సేనను తెచ్చుకున్నా సైనికంగా పరిస్థితి ఏమీమారదు. వారు ఇదంతా మనని రెచ్చగొట్టి తప్పుదారిని పెట్టేందుకే చేస్తున్నారు. మనం రెచ్చిపోవరాదు, సహనం కోల్పోనూ రాదు. అమాటంటే మనం ఏమీ చేయకుండా సహించి వూరుకొంటున్నామనిగానీ, తగినంత జాగ్రత్త వహించటంలేదనిగానీ కాదు.

ఢిల్లీలోని విదేశీ ప్రతినిధులు కొందరు పోర్చుగల్ ప్రోద్బలంపై మనవిదేశాంగ కార్యాలయానికి వచ్చి మన ప్రవర్తనకు అసమ్మతి తెలిపారన్నదీ, ఆవిదేశాలలో చాలాభాగం యీవిషయంలో తమతో ఇంచుమించు ఏకీభవించినవని పోర్చుగల్ చేసిన ప్రకటన కూడా నిజంకాదు. ఇద్దరుముగ్గురు యీవిధంగా మనదగ్గరకు వచ్చి, గోవా విషయను అడిగి, యీవిషయం శాంతంగా పరిష్కారం కావాలని తాము కోరుతున్నట్లు తెలిపినమాటమాత్రం నిజమే. నాకు తెలిసినంతవరకూ అంతికుమించి మాట్లాడినవారెవరూ లేరు.

వాటికన్ విషయంలో ఒక్కమాట చెబుతాను. ఈవిషయంలో వాటికన్ పోర్చుగల్ పక్షమేమీ వహించలేదు. వారితరఫున నేను మాట్లాడలేనుగాని, నాకు కలిగిన అభిప్రాయమేమిటంటే ఈవిషయంలో పోర్చుగల్ వైఖరి వారికి చాలాకష్టం కలిగించిందని" అని నెహ్రూ అన్నారు.

ఇండోచైనా సహరాజ్యాలను భారతదేశం పరిగణించటం గురించి మాట్లాడుతూ ప్రస్తుతం అనేక కారణాలవల్ల ఈరాష్ట్రాలను లాంఛనపూర్వకంగా పరిగణించటం వాంఛనీయంకాదని అనిపించిందనీ, అయితే లాంఛన విరహితంగా మాత్రం మనం వీటని పరిగణించామనీ, అంతర్జాతీయ పర్యవేక్షక సంఘాలలోని మన ప్రతినిధులు ఆప్రభుత్వాలతో వ్యవహరిస్తున్నారనీ ఆయనన్నారు.

### కృష్ణమీనన్ ప్రసంగం

ప్రధాని ప్రత్యుత్తరం ఇవ్వటానికి ముందు వి. కె. కృష్ణమీనన్ గోవా విషయంలో భారతదేశం పోర్చుగల్ వలలో పడరాదన్నారు. గోవా సమస్య పోర్చుగల్ కంటే మనకే విషమపరీక్ష అన్నారు. భారతదేశం ఏమాత్రం తప్పటడుగు వేసినా శత్రువులు సంతోషిస్తారన్నారు.

జెనీవా సమావేశంలో కుదిరిన ఒప్పందం వియత్నాంను విభజించిందనేమాట అబద్ధమనీ, అది యుద్ధ విరమణ నిమిత్తం ఏర్పరుచుకొన్న హద్దుమాత్రమేననీ మీనన్ అన్నారు. ఇండోచైనా దేశాలు యే సైనిక ఒప్పందంలో గానీ, కూటాలు గానీ చేరటం జెనీవా ఒప్పందానికి విరుద్ధమనికూడా అయనన్నారు.

ఆగ్నేయాసియా రక్షణవ్యవస్థఅనేది సమితి ప్రణాళికకు విరుద్ధమనీ, అద్దివి ప్రాంతీయ వ్యవస్థా కాక, కొన్ని సామ్రాజ్య దేశాలూ, ఇతర దేశాలూ ఒకప్రాంతాన్ని రక్షించేందుకు ఏర్పరుచుకొంటున్నటిదనీ, అంటే 'రక్షిత ప్రాంత'మనే దానికి కొత్త పేరనీ అన్నారు. ఇప్పుడు దీనిని ఏర్పరచటం జెనీవా సమావేశంలో అరంభమయిన రాజీ ధోరణిని వెనక్కు తిప్పటమేనని కూడా అన్నారు.

సహజీవనం గురించి మాటలాడుతూ ఆయుధ విసర్జన జరిగితేనూ, ఆర్థిక జాతీయవాదానికి ఒక పరిమితి ఏర్పాటైతేనూ, కొన్ని ప్రాంతాలలో వలస విధాన విస్తరణకు అరికట్టటం, మరి కొన్నిచోట్ల వాణినిర్మూలనాన్ని చేసిర పర్చటం జరిగితేనూగాని సహజీవనాశయాన్ని చేరలేమన్నారు.

విదేశాంగ విధానంపై నేటి చర్చలో శ్రీమతి వైలెట్ అల్వా గోవాపై మతదృష్టి తమకేమో దాపక్కు కలదనే పోర్చుగీసు వాదాన్ని ఖండించారు. ఆదిలో పోర్చుగీసువారక్కడ చాలా దౌర్జన్యాలు చేశారంటూ, ఎన్ని కాల్పులు జరిగినా గోవా భారత పక్షాన కిందికిరాక తప్పదన్నారు. బి. వి. ఘోష్ ఆసియా దేశాలు ఏకమై తమ ఆర్థిక స్థితిగతులు బాగుపరుచుకొనేందుకు మార్గా లన్వేషించాలన్నారు. శ్రీమతి లీలావతీమున్షీ భారతీయులు స్వతహాగా స్వాతంత్ర్య ప్రపంచ పక్షుసు లేననీ అయితే, గోవా విషయంలో బ్రిటన్ భారతదేశాన్ని కాక పోర్చుగల్ ను బలపరచటంవంటి చర్యల మూలంగా చిక్కులు వస్తున్నాయన్నారు.

ఎన్. జి. రంగాగారు భారతదేశం అభివృద్ధిచెందటానికి అవసరమనీ, ఈ సందర్భంలో ఇరుగుపొరుగు రాజ్యాలతో స్నేహం వాంఛనీయమనీ, హిమాలయ సరిహద్దున శాంతికి భంగం కలగదన్న 'పెద్దమనిషిమాట' రావటం చాలా మంచిదనీ అన్నారు. గోవా విషయంలో తాము ప్రధాని విధానాన్ని ఆమోదిస్తున్నామనీ, అయితే, తరుణం వచ్చినప్పుడు గోవన్ల రక్షణకు పోవటానికి అంతర్జాతీయ బాధ్యతలు అడ్డురాకుండా వుండేటట్లు చూచుకోవాలని ప్రధాని ఈ విషయం మనస్సులో వుంచుకోవాలనీ అన్నారు. జెనీవా ఒప్పందం ఇండోచైనాను విభజించిందనేమాట అబద్ధమనీ, అసలు ఆ దేశము ఎన్నడూకూడా ఏకదేశమూ, ఏకజాతీ కాదనీ అన్నారు.

ఎస్. మహంతి ప్రధానమంత్రి విదేశాంగవిధాన ప్రస్తుతిలో తాము పాల్గొనజాలమన్నారు. ఈ విధానం మనని ఎప్పుడూ కొరియా, ఇండోచైనాలకు తీసుకుపోతుందిగాని, కాశ్మీర్, పాక్ భారత సంబంధాలు, సింహళం, దక్షిణాఫ్రికాల గురించి 'తిమ్మ'ని దన్నారు. భారత విదేశాంగ విధానం ఇతరదేశాల విదేశీ సమస్యలను పరిష్కరించి పెడుతోందిగాని, మన వాటిని మూలపడేసి వుంచుతోందన్నారు. గోవా విషయంలో ప్రభుత్వం ఏమీ చేయలేకపోతే భారతీయులకే మార్గం నిరంకుశంగా వుంచాలన్నారు. డాక్టర్ అనూప్ సింగ్ అంబేడ్కర్ వాదాలను ఖండించారు. ప్రొఫెసర్ వినయ్ సక్సేనా విదుర్మకులు తమదేశపు విధానాన్ని తప్పు టెక్కిన ప్రతిదేశపు విధానాన్ని మెచ్చుకొంటున్నారన్నారు. డాక్టర్ [illegible] ప్రసంగించాక, ప్రధాని ప్రత్యుత్తరంతో ఈ వ్యవహారం ముగిసింది.

# ఆంధ్రపత్రిక ★ సారస్వతానుబంధం

1954 సం॥ ఆగస్టునెల 29వ తేదీ, ఆదివారము


కథానిక

## కీలుబొమ్మ

శ్రీ పురాణం సూర్యప్రకాశరావు

గోవిందరావుగారు గుమ్మంలో అడుగు పెట్టగానే కూతురు సరస్వతమ్మ ఎదురొచ్చి చెప్పింది తల్లి ఒంట్లో ఏమీ బాగాలేదనీ, జ్వరం తీవ్రంగా కాస్తోందనీను.

"నే ఇక్కణ్ణించేముందు మామూలుగానే ఉందిగా ఇంతలో ఏమొచ్చింది" అంటూ ఆయన విసాదకంగానూ కొంతకి తగిలించి నేరుగా పెరట్లో బావిదగ్గరకు నడిచారు.

సరస్వతమ్మ ఈ ధర్యపు క్షణం నేను స్తబ్ధురాలయింది. గదిలోకి వెళ్ళి మెల్లగా "నాన్నగారు వచ్చారు" అంది మంచంలో నిస్త్రాణగా పడున్న తల్లితో.

ఆమె కళ్ళు తెరచి అలాగా అన్నట్టుగా మూలిగింది తల ఊపుతూను.

సరస్వతమ్మ అనుకుంది: "గోవిందరావుగారు చిన్నప్పటినుంచి గడుసుగా తెలివిగా వ్యవహరిస్తారు. వారు లోకంలో తమకేవీ సంబంధం లేదన్నట్టుగా తమ బాగోగులుగురించే ఆలోచించే స్వార్థపరులు కాకపోయినా జీతసైనంతవరకూ నలుగురికీ సహాయం చేస్తూ స్వంత విషయాల్లో అలక్ష్యం చెయ్యకుండా తెక్కంగా గడిపేవాళ్ళందరిలో తను చూసింది. తనకులు దీనధర్మం ఎక్కడైనా ఉందా? ఇటువంటివ్యక్తుల్ని 'నే నెక్కడా చూళ్ళేదు బాబు'" గోవిందరావుగారి గురించి సరస్వతమ్మ ఇంతసేపూ ఆలోచిస్తూనే ఉంది. అప్పటికీ. ఆయన గదిలో అడుగుపెట్టలేదు.

సరస్వతమ్మముఖం కోపంతో ఎఱ్ఱబడింది. "ఏవిటమనిషి! అమ్మకి ఒంట్లో బాగుండలేదని తను చెప్పింది. ఆ తరువాత ఆయన కర్తవ్యం ఏవిటి? ఆయన బాధ్యతేవిటి? ఇప్పుడాయన పంచరించే విధానం!" మనసులో చిరాకు పట్టమేకాదు ఒకటిరెండు అనకూడని మాటలుకూడా ఆమెనోట్నుంచి అప్రయత్నంగా వెలువడ్డాయి.

అప్పటికీ ఆయన గదిలోకి రాలేదు.

సరస్వతమ్మకి ఉద్రేకం వస్తోంది. కళ్ళు చెమ్మగిల్లాయి. తల్లివేపు జాలిగా చూసింది. ఈ వయసులోకూడా ఆమె కర్తవ్యం ఆమె పాటిస్తూనే ఉంది. ఆమె బాధ్యత ఆమె నిర్వర్తిస్తూనే ఉంది. ఈ బాధ్యతలు తమ పాటగా ఉంటాయి. వాటికి లొంగేవ్యక్తుల్ని లొంగనివ్యక్తులు అలక్ష్యం చేస్తూంటారు. పరిహసిస్తూంటారు. ఇప్పుడు ప్రపంచంలో జరుగుతున్నదంతే. అయితే బాధ్యతారహితంగా సంచరించేవ్యక్తుల్లో రెండు తెగలుంటాయి. తెలిసి తప్పించుకుందుకు చూసేవాళ్ళు, తెలియక అమాయకంగా సంచరించే వాళ్ళు, సరస్వతమ్మదృష్టిలో గోవిందరావుగారు ఈ రెండు తెగల్లోనూ ఏ ఒక్క తెగకూ చెందినవాడుగా కనిపించలేదు. ఆయనకీ కొన్ని బాధ్యతలున్నాయి. వాటిని ఆయన సక్రమంగానే నిర్వర్తిస్తాడుకూడాను. అయితే ఆ బాధ్యతలువేరు. తనకీ సంసారానికీ సంబంధించిన బాధ్యతలుమటుకుకావు. లోకంలో ఎవరికి సంబంధించిన బాధ్యతైనా కావచ్చు. వాటిలోపాలు పంచుకోటానికి గోవిందరావుగారు ఏ విధమైన అభ్యంతరం కనబర్చరు. అందుకోసం ఆయన స్వయంగా తొందరపడతారుకూడాను.

కారణం ఏ ఒక్కరినోటి నుంచి విన్నా "ఓహో! గోవిందరావుగారా ఆయనగురించి వేరే చెప్పాలా! ఆయన వల్లకాని పనేదైనా ఉందా! ఆయన సహాయం పొందనివాళ్ళున్నారా! ఎంతమంచివాడు!" అని అనుకోవటం ఆయన చాలాసార్లు విన్నారు. విని లోలోపల ఆనందించారు. పైకిమటుకు ఇటువంటి స్తోత్రాలంటే తనకేవిటో చిరాగ్గా ఉంటుందిసుమా అన్నట్టుగా ప్రసంగవిషయం మార్చేస్తూ ఉంటే వారు. దాంతో ఆయనపేరు మరీ ఇనుమడించింది.

గోవిందరావుగారిప్పుడు ఓ క్షణం వృథాగా పోనివ్వటంలేదు. అంతేకాదు మరేమీ లేదు. ఆయన దృష్టిలో కూరలూ, పప్పులూ ఇత్యాది నిత్యావసరవస్తువులు తీసుకురావటంకోసం ఖర్చు పెడుతున్న కాలంకూడా వృథాగా పాడు చేస్తున్నట్టే ఫీలవుతున్నారు. అందుకోసం ఇంటావిడలో అడపాదడపా చిల్లర తగాదాలు. నలుగురిలోనూ గడిచేకాలం ఎంతో అమూల్యమైనదిగా ఆయన భావిస్తున్నారు. అందుకామె ఎందుకు అభ్యంతరపెట్టాలోకని ఆయన ఆక్షేపణ.

సరస్వతమ్మ నేరుగా హాల్లోకిపోయి చూసింది. గోవిందరావుగారు కనిపించలేదు. వీధిచపారాలో ఎవరితోనో మాట్లాడుతున్నారు. ఆమె గుమ్మం దగ్గరగా వెళ్ళి నిలబడింది.

"మీ వల్లకానిపని ఉందా చెప్పండి. ఉదయంనించి మీకోసం కాచుకుని ఉన్నాం. ఇప్పటికి పట్టుకోగలిగాం. శర్మగారు చెప్పారు మిమ్మల్ని కలుసుకోమని."

"శర్మగారు మీ కేమవుతారు?" గోవిందరావుగారు వేసినప్రశ్న.

"ఎత్తితేనే రెండు చుక్కలవుతాయి. అసలు అవసరప్రసంగం. త్వరగా తెముల్చుకోనూ ఏదో" అనుకుంది సరస్వతమ్మ.

"మంచిపనులు కోరుతుంటే పరిచయములు అతి సంబంధం."

"అలాగా దాలా మంచివారు మనుమండీ. ఎంత చిన్న అవసరమైనా నా దగ్గరకి పరుగెత్తుకొచ్చేవాడు. నా సలహా సంప్రదింపులు లేనిదే ఏదీ స్వతంత్రించి చేసేవాడుకాదు."

"ఏమీ అవసరం లేని దూరం కదండి. అంతదూరం నించి వచ్చిం దెందుకు మరి. ఈసంబంధం మీచేతులమీదుగా స్థిరపడి వివాహం జరిగిపోయిందా ఆ ముసలాళ్లు నిశ్చింతగా కాలం వెళ్ళబుచ్చు మీరు శ్రమ అనుకోకుండా పూనుకోవాలి."

"ప్రయత్నిస్తాం. నాశాయశక్తులా కృషిచేస్తాను. అని హామీ ఇచ్చారు గోవిందరావుగారు.

వాళ్లు రెండు మూడు రోజులు పోయింతర్వాత కలుసుకుంటాం అని చెప్పి వెళ్లిపోయారు.

సరస్వతమ్మ మాట్లాడకుండా గుమ్మంవారనే నిలబడి ఉంది. ఆయన ప్రవర్తన కనిపెడుతూనే ఉంది. గోవిందరావ్ గారు భార్య పడుకుని ఉన్న గది చాయలకన్నా పోలేదు సరికదా టేబులు ముందు కూర్చుని ఏదో రాయటం మొదలెట్టారు. క్షణం పోయింతర్వాత "అమ్మాయీ అన్నం పెట్టవే" అన్నారు.

సరస్వతమ్మ ఆగ్రహం అప్పటికి దాని ఉన్నతోన్నతశిఖరాల నందుకుంది. "అయితే ఇందాక నే చెప్పిందంతా మర్చిపోయారన్నమాట?" అంది అడుగైనా ముందుకు వెయ్యకుండా

ఏవిటది ?

"ఏవిటా! నా తలకాయి. నీకసలు మతిపోతోంది నాన్నా. అమ్మకి ఒంటి మీదస్పృహలేదు. జ్వరం కాస్తోంది అనిచెబితే డాక్టరుకి చూపించాలనైనా తెలియదూ? కనీసం ఆమెని చూటానికైనా తీరికలేదన్నమాట"

అప్పటికాయన తేరుకుని "అవునే మరిచాను సుమా. వాళ్లెవరో వచ్చి బాతాఖానీ వేసేసరికి అసంగతే మర్చిపోయాను. ఏదీ ఎక్కడుంది" అంటూ ఆయన అదుర్దా పట్టం చూస్తే సరస్వతమ్మకి ఏవిధాలో నవ్వాలో బోధపడలేదు.

మంచంవారగా నిలబడి ఆయనేవో డాక్టరువేసే ప్రశ్నల్లాంటివి అయిదారు అడిగారు: "ఉదయం నించీ ఒంట్లో తేడాగానే ఉందా?"ఇదో ప్రశ్న. రెండో ప్రశ్న: భోజనం చేసిందా? డాక్టరువచ్చి చూళ్లేదు కదూ? —ఈ చివరి ప్రశ్నకు మాత్రం సరస్వతమ్మ జవాబు చెప్పింది. "అదేం ప్రశ్న. మీరు తీసుకొచ్చేవారెవరున్నారు?"అని ఎదురు ప్రశ్న వేసింది.

"అలాగా. ఇప్పుడేవెళ్లి తీసుకొస్తానుండు." అంటూ ఆయన కండువా బుజాన్ని వేసుకుని చరచరా వీధిలోకి వెళ్లారు.

సరస్వతమ్మ నవ్వుకుంది. "వాళ్లెవరో వచ్చి కబుర్లు మొదలుపెడితే తనకి మటుకు తెలియద్దూ. వాళ్లి అవతరానికి వాళ్లొస్తారు. మన పన్లు మనం చూసుకోవద్దూ" అనుకుంది.

తల్లి మెల్లగా మూలిగింది సరస్వతమ్మ గుండెల్లో ఛోషాణం ఈడ్చినట్లే ఉంది. మంచం వారగా నేలమీద చతికిలబడింది.

"అబ్బ తలపోటు భరించలేనే తల్లీ" ఆమె అంతబాధలోనూ రెండు చేతుల్లో కణతల్ని అదిమి పట్టుకుని అంది.

సరస్వతమ్మ లేచి అమృతాంజనం తీసుకొచ్చి కణతలకి రాసింది.

మరో అరగంటలో గోవిందరావ్ గారు డాక్టర్ని తీసుకొచ్చారు. ఆయన పరీక్షచేసి "ఫర్వాలేదు తగ్గిపోతుంది" అని చెప్పారు. సరస్వతమ్మ ఏదో పెద్ద బరువు నెత్తిమీదనించి కిందకు దింపినట్టుగా నిట్టూర్పింది తలుపు వారగ నిలబడి.

డాక్టరుగారు వెళ్తూ వెళ్తూ గుమ్మం వార నిలబడి ముందు దొడ్లో ఏపుగా పెరిగి పందిరంతా చిక్కగా అల్లుకుపోయిన దొండపాదుని చూసి "నాకు దొండకాయ లంటే మహా చెడ్డ ఇష్టం. కొనాలంటే ఇవాల ఆకాశాన్నంటుతున్నాయండీ" అన్నాడు.

"దానికేముంది పెరట్లో పెంచుతుంటే సరి. లావుపాటి తీగ తీసుకెళ్లి పాతేస్తే ఇట్టే అల్లుకుపోతుంది"

"అలాగా! అయితే మా దొడ్లో నూ వెయ్యాలండీ"

"దానికేముంది తీసుకెళ్ళండి— అమ్మాయీ! అమ్మాయీ!" —గుక్క తిప్పుకోకుండా ఏవిటా తొందర అనుకుంది సరస్వతమ్మ.

"దాకు ఇలా ఇవ్వవే అంటూ గదంతా అలంగరం తిరిగేస్తున్నారు గోవిందరావ్ గారు. అంతలో ఆయనకి గోడ మూలకత్తిపీట కనిపించింది. ఏవిటో కంగారు! డాక్టరంతటివాడు తనదొడ్లో దొండపాదుమీద మనసుపడ్డాడంటే ఆయన కంతి కంపె కాహార్చిందనేమో. ఇంతసేపు డాక్టరుగారిని గుమ్మంలో నిలబెట్టటం తనకేదో అవమానం జరిగినట్టుగా ఫీలవుతున్నారు గోవిందరావ్ గారు. కాళ్లూ చేతులూ విరగదొక్కుంటున్నారు.

ఆరోండ తీగ ఆయనచేతిలో పెట్టే వరకూ గోవిందరావ్ గారు చేసినహడావిడి అంతా ఇంతా కాదు.

"అబ్బ! చెయ్యి గీసుకు పోయిందే" అన్నారు గోవిందరావు చెయ్యి అదిమి పట్టుకుని కూతురితో

"అవును మీకసలు ఒళ్లు తెలుస్తేనా దొండతీగ కొయ్యటానికి అంత తొందరెందుకు చెప్పు" అంది సరస్వతమ్మ.

ఆయన విస్తరిముందు కూచునేసరికి అపరాహ్ణం తిరిగింది. భోజనం చేస్తూ కూతురుతో చెబుతున్నారు. "అనుబ్బులుగాడికి నాసత్తా తెలియదు కాబోలు ఆ ప్రాంతా కాకేద్దాం అనుకున్నాడు. ఉన్న నాలుగెకరాల్లో తమ్ముడూ తనూ చెరి సగం పంచుకోవటం సబబు. తమ్ముడు అనారోగ్యపుమనిషి. అందుకని వాడి వాటా వాడికి ఇవ్వకుండా వాడికి తను వైద్యం చేయించాట్ట, అందుకైన ఖర్చు కింద వాడి వంతు వాటాకూడా తనకే రాసియ్యాలట! లోకం చూడు ఎలా మారిపోయిందో!

"ఎవరిసంగతి నువ్వు చెబుతున్నది?" అడిగింది సరస్వతమ్మ.

ఆ! మన సుందరయ్యగారి కొడుకులు సుబ్రహ్మణ్యం, వేణుగోపాలం" అయితే నువ్వెళ్ళి వాళ్ల తగాయిదా పరిష్కరించాలన్నమాట."

"అంత తేలిగ్గా లొంగుతాడూ. ఇంకా సమాధానం కుదరలేదులే. ఓమారు పట్నం పోయిరావాలి. రేపుదయం వెళ్ళాలను కుంటున్నాను."

"ఇటువంటి వ్యక్తుల్ని గురించి ఆలోచించాలనుకుంటే వాటికో అంతూదరీ అంటూ కనిపించవు" అనుకుంది. సరస్వతమ్మ. తల్లి ఆరోగ్యం బాగు లేదు. ఆసంగతి ఆయనకి తెలుసు. అయితే అందుకాయన అంతగా బాధపడుతున్నట్టుగా తనకి కనిపించటం లేదు. ముందు భార్య ఆరోగ్యం కంటే ఎవరో అంతర బొంతర వాళ్ల ఆస్తి తగాయిదాలు ఆయనకి ముఖ్యం అన్న మాట!" మనసులో ఈ పడించుకోవటమే కాదు పైకే అనేసింది "అమ్మకి జ్వరం తగ్గకపోతే నువ్వూ వూళ్లోలేకుండా పోవటం ఏమీ బాగుండదు. నే ఒక్కతినీ ఉండాలి" అని

"ఎన్నాళ్లుంటా నేవిటి రేపీపాటికి వచ్చేయ్యనూ"

"ఏమైనా నువ్వు వెళ్లటానికి వీల్లేదు."

"అలాగంటే ఎలాగే పాపం అతను ఇబ్బంది పడ్డూ. తర్వాత మరోపని కూడా ఉంది. పెళ్ళి సంబంధం చూడాలి"

"ఎవరికి?"

"ఉదయం రాలా. ఆయన పెద్దలికి గుంటూరులో ఓ సంబంధం ఉంది. నేచెప్తే ఆయన ఒప్పుకుంటాడు. అబ్బాయి తండ్రి నాకు బాగా పరిచయస్థుడు."

"అంతేనా? ఇంకేమయినా వున్నాయా."

"ఇంతవరకూ లేవుమరి"

సరస్వతమ్మ ఇక మీదట సంభాషణ పొడిగించ దల్చుకోలేదు. ప్రయోజనం ఉండదని ఆమెకి తెలుసు.

* * *

ఆ తెల్లవారు ఝామునే ఆయన ఎముకలు కొరికే చలిలో నాలుగంటలకల్లా లేచి కాలకృత్యాలు తీర్చుకుని పట్నం బయల్దేరారు. సరస్వతమ్మ ఆయన గుమ్మందాటే వరకూ లోపల్లోపల సణుక్కుంటూనే ఉంది. ఇంతలో పనిమనిషి కేక వినిపించి పెరట్లోకి నడిచింది.

"ఏవిటే అప్పుడే వచ్చేసావు ఇవ్వాళ" అంది సరస్వతమ్మ.

"సెందరాకే పట్నం పోవాలమ్మ. అబ్బాయికి ఒంట్లో బాగులేదని కబురొచ్చింది నిన్న," అంది పనిమనిషి.

ఆ తర్వాత తెలతెలవారు తొందరగా పాలవాడొచ్చి పీకమీద కూర్చున్నాడు. వాడికి రెండునెల్ల డబ్బు బాకీ. ఈ పూట ఆ డబ్బిస్తేనే పాలు పోస్తానంటున్నాడు. వాడితో వాగలేక సరస్వతమ్మ తలబట్టకట్టి పోతోంది.

"అయ్యగారింట్లో లేరు. పచ్చేం చెయ్యమంటావు"

"అంతే లెండి. అలాగంటే ఒక్కమాటలో పోతుంది. ఏ పేచీ ఉండదు. నాకదంతా తెలవదండీ. నాకివ్వాల్సిందే అనా మైసలలో లెఖ్ఖ కట్టి పడేయ్యండి. లేకుంటే పాలుపోసేది లేదు."

"సరే అలాగయితే రేపువయం రమ్మను" అంటూ కాఫీ చిన్నేదో తెమ్మని లోపలికే వచ్చేసింది సరస్వతమ్మ.

"ఏవిటే అంటున్నాడు" అంటూ తల్లి వచ్చి గుమ్మం వారగా నిలబడింది తలుపు వారుగ.

"ఏమంటాడు. డబ్బిస్తేగాని పాలు పొయ్యట్ట"

"అంతే అవుతుందనుకున్నాను. ఏ నెలకానెల బాకీ పెరిగి పోతుంటే వాడుమటుకు బ్రతకొద్దూ?"

"నిన్న నాన్న వడిగితే వినిపించుకుంటేనా?" అంది సరస్వతమ్మ అభిమాన స్వరంలో.

"ఆయనెందుకు వినిపించుకుంటారే. ఆ స్వభావం నాకు తెలవదూ. ఇంత పొద్దున్నే" ఈయన ఎక్కడికి వెళ్ళినట్టు?"

"ఎక్కడికంటే ఏం చెప్పను. ఎవరో ఆస్తుల పంపకంలో తగాదా పడ్డారుట. వాళ్లకి రాజీ కుదర్చటం ఒకపని. ఇంకెవరి చెల్లెలుకో పెళ్లి సంబంధం చూడాలట. అందుకని పట్నం వెళ్లారు"

"బాగుంది!" అనుకుంది మనసులో.

సరస్వతమ్మ వంట గదిలోకి నడవగానే తన గదిలోకి పోయి దుప్పటి కప్పుకుని పడుకుంది.

మరో నిముషం పోయింతర్వాత సరస్వతమ్మ వచ్చి "అన్నట్టు ఈ పూట బియ్యం నిండుకున్నాయే ఏం చెయ్యమంటావు. పక్కింటి మహాలక్ష్మిని అడిగేదా?" అంది.

"అడిగి చూడు"

మహాలక్ష్మి ఈ పూట తనే ఇంకొకరి దగ్గర అప్పుతీసుకున్నానంటూ నసిగే సరికి సరస్వతమ్మ ప్రాణం వచ్చిపోయినట్టయింది. ఆమె ఉంచుకునే అబద్ధం ఆడింది. కిక్కురు మనకుండా ఇంటికి వచ్చేసింది.

"జనక బజార్లో అబ్బాయిమ్మని అడిగి పట్టా ఇస్తుంది" అంది తల్లి ఈ కంఠంలో కొద్ది విసుగుదల కూడా ధ్వనించింది. ఇంట్లో బియ్యం నిండుకున్నాయని రాత్రితో అనేక మార్లు చెప్పింది ఈ వారంలో. ఆయన వినిపించుకోలేదు సరికదా పైన ఊరు విడిచి మరీపోయారు. ఇంట్లో ఏవుందో ఏది లేదో, ఆడవాళ్లు ఇబ్బంది పడతారేమో అనైనా ఆయనకి తోచకపోవటం ఆవిడకి ఆశ్చర్యం కలిగించలేదు గాని చిరాకెత్తించింది. అటువంటి వ్యక్తులు ప్రవర్తించే విధానం కొత్తలో ఆశ్చర్యంగా ఉన్నా రాను రాను ఆశ్చర్యం స్థానంలో కొద్ది విసుగుదలా చిరాకూ ఆక్రమించుకుంటాయి.

చేటలో బియ్యంతో తల్లిగదిలోకి వచ్చి నిలబడి "అబ్బాయమ్మ అందరిమో పరుగు మనిషి కాదు. నాచేతిలో చేట చూడగానే గ్రహించేసింది. పరాయివాళ్ళ దగ్గర అప్పు తీసుకున్నట్టే అనిపించలేదు. మహాలక్ష్మిని తల్చుకుంటేనే ఒళ్ళు మండుతుంది." అంది సరస్వతమ్మ.

"ఈ మహాలక్ష్మి మొగుడికి ఉద్యోగం పోయినంతే పనయితే ఈయన కలుగజేసుకుని ఆ ఉద్యోగం నిలిపారు. ఆ విశ్వాసం వాళ్ళకేం లేగా"

"నేనొచ్చి పదిహేనురోజులయింది. చూస్తున్నాగా ఈయన వరుస. అంతర బొంతర వాళ్ళ కందరికీ చాకిరీ చేస్తూ ఎందుకొచ్చిన ఖర్మ. మన అవసరాలంటే అలా నిర్లక్ష్యం చేసేస్తారు" అంది సరస్వతమ్మ.

"జమహాలక్ష్మికి నాలుగుసేర్ల బియ్యం ఇవ్వాలి. అబ్బాయమ్మకి పదిసేర్లివ్వాలి. తీర్చటం అంటూ ఉంటేగా. ఏ పూట బియ్యం ఆపూట కొట్లోంచి తెచ్చుకోవటం వండుకోవటం. ఇంటి విషయాలు ఆయన బొత్తిగా పట్టించుకోటంలేదు." దగ్గుతెర రావటంతో ఆగిపోయింది.

సరస్వతమ్మ "అయితే ఈ దేశసేవకయే ఖర్చుకూడా తనే భరించుకోవాలా?" అంది నవ్వుతూనే.

"లేకుంటే దేశసేవ ఎలాగౌతుంది. ఎప్పుడు పట్నం వెళ్ళారా, వాళ్లు దమ్మిడీ చేతిలో పెట్టరు. ఈయన పుచ్చుకోరుకూడాను"

"దేశసేవ చెయ్యటానిక్కూడా కొంత స్తోమతుండాలి. లేకుంటే సర్వసానం ఆత్మవంచనకింద తయారవుతుంది."

ఇంతలో వీధి గుమ్మంలోంచి "గోవిందరావుగారూ!" అన్న పిలుపు వినిపించింది. సరస్వతమ్మ లేచి వెళ్ళి తలుపుతీసింది.

"గోవిందరావుగారున్నారాండీ?" అడిగింది ఒక అపరిచిత వ్యక్తి. ఆమె నింతకుముందు సరస్వతమ్మ చూళ్లేదు.

"లేరండీ"

"ఎక్కడికెళ్ళారో తెలుసా?"

"ఊళ్ళోలేరు పట్నం వెళ్ళారు."

"ఊర్నించి రాగానే సుందరమ్మగారు మీకోసం వచ్చారని చెప్పండి. వెల్లూర్నుంచి తిరుగుతున్నాను. మా అబ్బాయి స్కూల్లో చదువుతున్నాడండి. వాడికొక్క స్టైఫండో ఇప్పిస్తే కొంతఖర్చు తగ్గుతుందని ఈయన ద్వారా ప్రయత్నిస్తున్నాము లెండి. గోవిందరావు చెబితే కాదనరు. ఎప్పుడొచ్చినా కనిపించరు. ప్రాణం విసిగి పోతుందండీ" అనుకుంటూ ఆమె వెళ్లిపోయింది.

నలుగుర్లోనూ ఆయన కింత గౌరవం మర్యాద ఉండటంకూడా ప్రాణసంకటంగానే ఉంది. ఆవిడబ్బాయికి స్కాలర్ షిప్పుకోసమని వెల్లూర్నుంచి తిరుగుతున్నా ఈయన విశ్వసం కొంటంలేదని నిష్ఠురంగా మాట్లాడేటంత లోపల

(6 వ పేజీ చూడుము)

## వాల్మీకి రామాయణం

శ్రీ శ్రీనివాస శిరోమణి

౧౦

శ్రీహిహాత్సరాలు మంథర విపరీత బోధచేసినందువల్ల కైకేయీదేవి తనభవిష్యత్తును గురించి భయపడిపోయింది. దిగులుపడ్డది. విషముపూసిన బాణముదెబ్బ తిన్న కిన్నరాంగనవలె నేలకు ఒరిగింది. కోపముతో ఆడతాచు పాము వలె బుసలుకొట్టింది. కర్తవ్యము మనసా నిశ్చయించుకొన్నది. తాను సంకల్పించుకొన్న కార్యము నెరవేరకుండా నెరవేరదా అని కొంచెముసేపు ఆలోచించింది. కృతకృత్యను అవుతాను అనుకొన్నది. మంథరను చూస్తూ మెల్లగా "అంతా బాగుంది" అని చెప్పింది.

ఆమె సంకల్పము సిద్ధించినట్లే మంథర నిర్ణయించుకొన్నది. ఎంతో సంతోషించింది. కైకేయిదేవి తీసివేసిన రంగురంగుల పూలదండలనూ రత్నాల హారాలనూ ముత్యాలహారాలనూ దివ్యాభరణాలనూ ఆ నేలమీద చెదచల్లి వెళ్లిపోయింది.

కైకేయీదేవి మాసినచీర కట్టుకొని చక్కగా అల్లిఉన్న తనజడను విప్పుకొని తలవెంట్రుకలు అన్నీ గడ్డినంటివలె ఒక్కపాయగా ముడిపెట్టి కనుబొమ్మలు ముడివేసి పుణ్యాంతముఅయిన కిన్నరాంగనవలె కటిక నేలమీద పడుకొన్నది. ఆచీకటిఇంట్లో మంథర వెదచల్లిపోయిన ఆభరణాలు అన్నీ నీలాకాశములో నక్షత్రాలవలె మెరుస్తూఉన్నవి.

దశరథమహారాజు పట్టాభిషేకము ప్రకటించి కొలువుచాలించి అంతఃపురములోకి బయలుదేరినాడు. కైకేయీదేవికి రామపట్టాభిషేక విషయము తెలిసిఉండదు అనుకొన్నాడు. ఆ సంతోషవార్త ఆ ప్రియురాలికి స్వయముగా చెప్పవలెను అనుకొని రాహువు ఉన్నాడు అని తెలియక తెల్లనిమేఘాలు ఉన్న ఆకాశములోకి చంద్రుడు పోయినట్లుగా దశరథ మహారాజు కైకేయీదేవి అంతఃపురములోకి పోయినాడు.

కైకేయీదేవి అంతఃపురములో చిలుకలూ కోకిలలూ కొంచపిట్టలూ హంసలూ నెమళ్ళూ ఎప్పుడూ మనోహరముగా పాటలు పాడుతూ నేత్రపర్వముగా నాట్యముఆడుతూ ఉంటవి. ఎటుచూచినా సంపెంగచెట్లూ అశోకవృక్షాలూ లతాగృహాలూ చిత్రగృహాలూ కనబడుతవి. వాటిలో ఏనుగుదంతాలూ వెండి బంగారాలూ పొదిగిన తిన్నెలు ఎంతో అందముగా ఉంటవి. దోహదక్రియలవల్ల ఆ అంతఃపురోద్యాన వనములో అన్ని ఋతువులలోనూ వృక్షలతాగుల్మాలు పూలుపూస్తూనూ కాయలు కాస్తూనూ పండ్లు పండుతూనూ ఉంటవి. సమయోచితముగా వీణలు మ్రోగిస్తూ పిల్లనగ్రోవులు ఊదుతూ మద్దెలవాయిస్తూ కంచుతాళాలు వేస్తూ జంత్రగానము సాగుతూఉంటుంది. మాటకారులుఅయిన గూని దాసీలూ పొట్టిపొట్టి దాసీలూ సిద్ధముగా ఉంటారు. ఏనుగు దంతాలతోనూ బంగారములోనూ వెండితోనూ చేసిన పీటలూ మనోహరము అయిన మద్యాలూ దివ్యములయిన రకరకాల భక్ష్యాలూ రకరకాల అన్నాలూ ఎప్పుడూ సిద్ధముగా ఉంటవి. మనోహరముగా అలంకరించుకొన్న స్త్రీలు అక్కడ ఎప్పుడూ కనిపెట్టుకొని ఉంటారు. ఇన్నిమాటలు ఎందుకు—అది కేవలము స్వర్గధామము.

దశరథమహారాజు హుటాహుటీ ఆ అంతఃపుర శయ్యాగృహములోకి పోయినాడు. అక్కడ ఆయనకు కైకేయీదేవి కనిపించలేదు. ఆమె బుద్ధి బుగ్గ అయిపోయింది అనీ ఆమె స్వార్థపరురాలు అయిపోయింది అనీ ఆయనకు తెలియదు. కామోద్రేకముతో "కైకా" అని పిలిచినాడు. జవాబులేదు. తన రాకడప్పుడు రాగానే ఎప్పుడూ ఎదురుగుండా కైకేయీదేవి పరుగెత్తుకొనివచ్చేది. అట్లా ఆమె రాకుండా ఉండటమూ ఆ శయ్యాగృహము అట్లా శూన్యముగా ఉండటమూ ఆయన అదివరకు ఎన్నడూ ఎరగడు.

దశరథమహారాజు కైకను గురించి ద్వారపాలికను అడిగినాడు. ఆ ద్వారపాలిక భయముతో వణికిపోతూ "దేవా, దేవిగారికి చాలా కోపము వచ్చింది. క్రోధాగారములోకి పరుగెత్తింది" అని చెప్పింది. దశరథమహారాజు మనస్సు చివుక్కుమన్నది. ఆయన దేహముఅంతా కంపించింది.

ఆ చీకటి గదిలో కటిక నేలమీద పడిఉన్న కైకేయీదేవిని దశరథమహారాజు చూచినాడు. ఆ సుకుమారి అట్లా నేలమీద పడుకొన్నందుకు ఆయనకు కష్టము వేసింది. దుఃఖము వచ్చింది. ఆయన వృద్ధు. ఆమె తరుణి. అందువల్ల ఆయన తన ప్రాణముకన్నా ఆమెను ఎక్కువగా చూచుకొనేవాడు. ఆయన ఏ పాపమూ ఎరగడు. ఆమె పాపసంకల్ప.

కత్తితో తెగకోసిన పూలతీగవలెనూ పుణ్యక్షయముఅయి నేలకూలిన దేవకన్యవలెనూ కింద పడతోసిన కిన్నరాంగనవలెనూ దేవలోకములోనుంచి జారిపడ్డ అప్సరాంగనవలెనూ పసచెడి నేలకూలిన మోహినీదేవతవలెనూ కట్టిపడవేసిన లేడిపిల్లవలెనూ అలసి సొలసి పడిపోయిన ఆడుగుర్రమువలెనూ అడవిలో వేటకాడువేసిన విషలిప్త బాణానికి నేలకూలిన ఆడుఏనుగువలెనూ ఉన్న కైకేయీదేవిని దశరథమహారాజు చూచినాడు. ప్రేమాతిశయముతో పెంటి ఏనుగును పోతుటేనుగు తొండముతో తడివినట్టు తన చేతితో తడివినాడు.

దశరథమహారాజు అట్లా కైకేయీదేవిని తన చేతితో నిమురుతూ తామరరేకుల వంటి ఆమె నేత్రద్వయాన్ని చూచినాడు. తొట్రుపాటుతో "దేవీ, నామీద నీకు కోపము రావటానికి కారణము ఏమిటి— నిన్ను ఎవరు అయినా తిట్టినారా— ఎవరు అయినా నిన్ను అవమానించినారా. వివరముగా చెప్పు.

"ఓ కళ్యాణీ, నీవు ఇట్లా దుమ్ములో పడుకొని ఉండటము నేను చూడలేను. నీకు ఏమి తక్కువ అయింది. నీకు ఏమిలోపము వచ్చింది. దయ్యము పట్టిన దానివలె ఈ కటిక నేల మీద ఎందుకు పడుకొన్నావు. చెప్పు.

"దేవీ, నీకు ఏమి అయినా సుస్తీగా ఉందా చెప్పు. సమర్థులు అయిన వైద్యులు ఎంతోమంది ఉన్నారు. వారిని పిలిపిస్తాను. నిన్ను ఎవరు అయినా కష్టపెట్టినారేమో చెప్పు. పోనీ నీ కోసము నేను ఎవరిని అయినా సంతోషపెట్టవలెనేమో చెప్పు. నీవు అనుకొనే దానికన్నా వెయ్యిరెట్లు ఎక్కువగా వారిని సంతోషపెట్టుతాను. రాణీ, నీవు దిగులు పడవద్దు. నీ దేహాన్ని ఇట్లా కష్టపెట్టవద్దు. ఎవణ్ణి అయినా చంపివేయమంటావా— ఎవణ్ణి అయినా వెళ్లగొట్టమంటావా— ఏ దరిద్రుణ్ణి అయినా ధనవంతుణ్ణి చేయమంటావా— ఏ ధనవంతుణ్ణి అయినా దరిద్రుణ్ణి చేయమంటావా— నీవు చెప్పినట్టు నేను చేస్తాను. నా వాండ్ల చేత చేయిస్తాను."

"కైకా, నాకు ప్రాణాపాయము అయ్యేపనిని అయినా నీ కోసము చేస్తాను. చెప్పు. నీ మీద నాకు ఎంత అనురాగము ఉందో నీకు తెలుసును. నేను నిన్ను సంతోషపెట్టుతాను. నన్ను నీవు శంకించవద్దు. చెప్పు. నా పుణ్యకర్మసాక్షిగా ఒట్టు పెట్టుకొంటున్నాను. దేవీ, ప్రాచ్యసింధుసౌవీరసౌరాష్ట్రాలూ వంగాంగ మగధ మధ్యదేశాలూ కాశీకోసల రాజ్యాలూ దక్షిణాపథమూ ధనధాన్యాలతో సమస్త ద్రవ్యాలతో సకల సమృద్ధముగా ఉంటూ ఉన్నవి. ఆ దేశాలలో నోరికే ఏ అమూల్య వస్తువులు నీవు కోరుకొన్నా నీకు తెప్పించి ఇస్తాను. ఓ శుభాంగీ, ఎందుకు నీవు ఇట్లా బాధపడుతావు. ఓ మంగళ స్వరూపిణీ, నీవు లేవవలెను. నీవు దేనికి భయపడుతున్నావో చెప్పవలెను. సూర్యుడు మంచును విడగొట్టినట్టు నీ భయాన్ని నేను పోగొట్టుతాను" అంటూ దశరథ మహారాజు కైకేయీ దేవిని బుజ్జగించినాడు.

ముందుగా తన భర్తచేత శపథము చేయించనిదే అప్రియము చెప్పకూడదు అని కైకేయీదేవి నిశ్చయించుకొన్నది.

౧౧

కామోద్రేకములో ఉన్న దశరథమహారాజుకు కైకేయీదేవి చూస్తూ "దేవా, నాకు జబ్బు ఏమీ లేదు. నన్ను ఎవరూ అవమానించలేదు. నిందించలేదు. నాకు ఒక కోరిక ఉంది. ఆ కోరిక మీరు చెల్లించవలెను. మీరు నా కోరిక చెల్లిస్తాము అని ఒట్టుపెట్టుకొంటేనే నా కోరిక ఏమిటో చెప్పుతాను" అంటూ చిరునవ్వు నవ్వింది.

దశరథమహారాజు చిన్న మందహాసము చేస్తూ ఆమె తలవెంట్రుకలు నిమురుతూ "ఓసీ పిచ్చిదానా, నీకంటే స్త్రీలలో నాకుప్రియురాలు ఎవరు. పురుషులలో రాముడికంటే నాకు ఎక్కువఅయినవాడు ఎవడు. ఇది నీకు తెలియదా. తెలుసును. కైకా, చెప్పుతాను". విను. నా బిడ్డలు అందరిలోనూ నాకు ప్రియము అయినవాడు రాముడు. వాడు అజయుడు. పరమపూజ్యుడు. నా ప్రాణముకన్నా వాడు నాకు ఎక్కువఅయినవాడు. కొన్నిక్షణాలు వాణ్ణి నేను చూడకపోయేట్లయితే బ్రతుకలేను. నీ కోరిక నేను చెల్లిస్తాను అని ఆ రాముడిమీద ఒట్టు పెట్టుకొని చెబుతున్నాను."

"ఓ సుభగ్రే, ఇప్పటికి అయినా నా మనస్సు తెలుసుకో. నీ కోరిక ఏమిటో చెప్పు. నేను చెల్లిస్తాను. నన్ను అనుమానించవద్దు. నిన్ను సంతోషపెట్టుతాను. నా [illegible]. నీ కోరిక చెల్లిస్తాను" అంటూ ఒట్టుపెట్టుకొన్నాడు.

ఆయన అనుకూలుడు అయినందుకు కైకేయీదేవి సంతోషపడ్డది. తన కోరిక శత్రువులతోనయినా చెప్పకూడనిది అని ఆమెకు తెలుసును. అది ఆయన ప్రాణాంతకము అవుతుంది అనికూడా ఆమెకు తెలుసును. కాని స్వార్థమూ స్వపుత్రపక్షపాతమూ ఆమెను మించి వేసినవి. "రాజా, నా కోరిక తాము చెల్లిస్తాము అని తమ కుమారుడు సాక్షిగా తమపుణ్యముసాక్షిగా ఒట్టుపెట్టుకొన్నారు. తమ శపథము ఇప్పుడు అగ్ని మహేంద్రుడు మొదలు అయిన ముప్పయి మూడుకోట్ల దేవతలూ విన్నారు. భూమ్యాకాశాలూ సూర్యచంద్రులూ తక్కిన గ్రహాలూ విన్నవి. ఈ రాత్రి సంచారము చేస్తూ ఉన్న సర్వభూతాలూ విన్నవి. ఈ రాజనగరులో ఇలవేల్పులు అందరూ విన్నారు.

"రాజా, మీరు సత్యసంధులు. పరమ ధార్మికులు. మహాపరాక్రమవంతులు. నా కోరిక చెల్లిస్తాము అని నాకు మాట ఇచ్చినారు. ఇందుకు దేవతలు అందరూ సాక్షులు సుమా" అంటూ కైకేయీదేవి దశరథమహారాజు చెయ్యి పట్టుకొన్నది. ఆ కాముకుడు ఉబ్బితబ్బిబ్బులు అయిపోయినాడు.

"ఓ రాజా, దేవాసుర యుద్ధము జ్ఞాపకము తెచ్చుకోండి. ఆరాత్రి శంబరాసురుడు అందరినీ సంహారము చేసివేసినాడు. మీరు అప్పుడు కొనఊపిరితో ఉన్నారు. నేను ఎంతో మెలకువతో అప్పుడు మిమ్ములను కాపాడినాను. మీ ప్రాణము దక్కించినాను. మీరు అప్పుడు నన్ను మెచ్చుకొని వివిలయినా రెండు వరాలు నేను కోరుకొన్నవి నాకు ఇస్తాను అని తాము అన్నారు. కాని అవి వచ్చినప్పుడు కోరుకొంటాను అని నేను ఆ రెండువరాలూ నిక్షేపమువలె తమ దగ్గరనే దాచిపెట్టుకొన్నాను.

"నాథా, తాము ఈ భూమిని అంతా ఏలుతూఉన్న ప్రభువులు. ఆడి తప్పరు అని ప్రసిద్ధి కెక్కినారు. మీరు నాకు భర్తలు. నేను అప్పుడు తమ దగ్గర దాచిపెట్టుకొన్న రెండు వరాలూ తాము నాకు ఇప్పుడు చెల్లించవలెను. ఇదే నా కోరిక. ఇదివరకు మీరు కోరుకొమన్న వరాలనే నేను ఇప్పుడు కోరుకొంటాను. మీరు ఆ వరాలు చెల్లించవలెను. నేను నోరు తెరిచి యాచించిన తరువాత ఆ వరాలు తాము ఇవ్వకపోతే నాకు అవమానము అవుతుంది. అవమానపడ్డ తరువాత నేను బ్రతికి ఉండజాలను. మీ ఎట్టఎదుటనే నేను ప్రాణము విడువవలసివస్తుంది" అంటూ ఆమె దశరథమహారాజును ధర్మపాశముతో బంధించివేసింది.

వలపన్నిబోయవాడు హూతపెట్టగానే జింక పరుగెత్తుకొనివచ్చి వలలో పడ్డట్టు కైక పన్నినవలలో దశరథమహారాజు ఏమీ తెలియకుండా పడిపోయినాడు. ఆ కామమోహితుడు ఆమె కోరే రెండు వరాలూ చెల్లిస్తాను అన్నాడు.

ఉత్ఫుల్లనేత్రాలతో కైకేయీదేవి దశరథమహారాజును చూచింది. దగ్గరకు చేరింది. ప్రశాంతముగా "నాథా, ఆ రాత్రి మీరు కోరుకోమన్న రెండు వరాలూ ఇప్పుడు రెండుగా కోరుతున్నాను. రాముడికోసము ఇప్పుడు మీరు ఏర్పాటుచేసిన అభిషేక సంభారాలు అన్నిటితోనూ నా కొమారుడికి భరతుడికి రాజ్యాభిషేకము చేయించవలెను. ఇది తాము నాకు చెల్లించవలసిన మొదటి వరము. ఇక రెండవ వరము. రాముడు జటాజినాలు ధరించి దండకారణ్యము పోయి పధ్నాలుగు ఏండ్లు ఋషిమాదిరిగా వనవాసముచేసి రావలెను. భరతుడు నిరాటంకముగా యువరాజు కావలెను. రాముడు పధ్నాలుగుఏండ్లు అరణ్యవాసము చేయవలెను. ఇదే నా ముఖ్యములయిన కోరిక. రాజా, ఇప్పుడే, నా కళ్ళ ఎదుటనే రాముడు అడవులకు ప్రయాణముఅయిపోవలెను. ప్రభూ, తాము రాజరాజులు. సత్యవ్రతులు. తాము శపథముచేసినారు. తాము దబ్బరలు ఆడకూడదు. నా కోరిక చెల్లించి తాము తమ వంశగౌరవాన్ని నిలబెట్టుకోవలెను. తమ సదాచారాన్ని కాపాడుకోవలెను. తమ జన్మసార్థకము చేసుకోవలెను.

"దేవా, ఆడితప్పనివారికే ఇహమూ పరమూ అని తపోధనులు చెప్పుతూ ఉంటారు" అన్నది కైకేయీదేవి—

౧౨

ఈ దారుణము అయిన మాటలకు దశరథ మహారాజు దద్దరిల్లి పోయినాడు. మూర్ఛపోయినాడు. కొంచెము సేపటికి తెప్పరిల్లి "ఇది కలా— నిజముగా కైకేయి ఇట్లా అన్నదా—చిత్తభ్రమణమా—పూర్వ జన్మ వృత్తాంతస్మరణమా— మనోజాడ్యమా" అని ఆలోచించసాగినాడు. ఏమీ అంతుపట్టలేదు. దుఃఖము అత్యుత్కటము అయిపోయింది. మళ్ళీ మూర్ఛపోయినాడు. చాలా సేపటికి తెలివి వచ్చింది. ఎటో పరుగెత్తబోయి ఆడుపెద్దపులి ఎట్టఎదుట పడ్డజింకవలె నివ్వెరపోయినాడు. ఆయన అవయవాలు పట్టు తప్పిపోయినవి. ఆ కటిక నేలమీద చతికిల బడిపోయినాడు. మంత్రానికి యంత్ర మండలములో కట్టుబడిపోయి బుసలు కొట్టే పాముకు వలె పెద్దపెద్ద నిట్టూర్పులు విడుస్తూ "ఛీ ఛీ" అన్నాడు. కోపోద్రేకముతో దుఃఖముతో కొట్టుకు లాడుతూ మళ్ళీ మూర్ఛపోయినాడు. ఎంతో సేపటికి తెలివి వచ్చింది. పరమక్రుద్ధుడుఅయిపోయినాడు. కన్నులలో నుంచి నిప్పుకణాలు రాలుస్తూ కాల్చివేసేట్టు చూస్తూ "ఓ దుష్టచారిణీ, మా వంశాన్ని నీవు నిర్మూలనము చేయతలచుకొన్నావా— నీకు నేను ఏమి అపకారము చేసినాను. రాముడు ఏమి అపరాధము చేసినాడు. సొంత తల్లికి సేవ చేసేట్టు నీకు సేవచేస్తున్నాడే. ఇప్పుడు నీవు వాడికి ఈ అన్యాయము ఎందుకు తలపెట్టినావు. నీవు రాచమారివి అనుకొన్నాను. తీక్ష్ణ విషసర్పాన్ని అజ్ఞానమువల్ల ఇంట్లోకి తెచ్చుకొన్నట్టు నిన్ను తెచ్చుకొన్నాను.

"ఓ కైకా, నా ప్రియపుత్రుణ్ణి రాముణ్ణి సకలప్రాణికోటీ కొనియాడుతూ ఉంది. వాడు ఏమి తప్పుచేసినాడు అని నేను అడవులకు వెళ్లగొట్టవలెను. అవసరముఅయితే నేను కౌసల్యనుఅయినా సుమిత్రను అయినా నా ఐశ్వర్యాన్ని అయినా నా రాజ్యాధికారాన్ని అయినా చివరకు నా ప్రాణాన్ని అయినా వదలిపెట్టుతాను. కాని నా జ్యేష్ఠపుత్రుణ్ణి అందులో అంతటి పితృవత్సలుణ్ణి నేను వదలిపెట్టలేను. వదలిపెట్టను. వాడు ఉంటూ ఉన్నందువల్లనే నేను బ్రతుకుతున్నాను. వాణ్ణి చూడకపోయేట్లయితే నా ప్రాణమే నిలవదు. కైకా పాపిష్ఠి కోరికలు కోరవద్దు. నీవు ఈ కోరిక ఇంతటితో మానుకో, రాముడిమీద కోపమువద్దు. నేను నీ పాదాలు పట్టుకొంటాను."

"కైకా, ఈ పరమదారుణము అయిన కోరిక నీవు ఎందుకు కోరినావు. భరతుడిమీద నాకు ప్రేమ ఉందో లేదో తెలుసుకోవలెను అని అడిగినావా— అయితే అయిఉండవచ్చును. అట్లా అయినట్లయితే భరతుడికి రాజ్యాభిషేకము చేయమని అడగవలెను; కాని రాముణ్ణి అడవులకు పంపించమని అడగడము ఎందుకు.

"ఓ కైకా,రాముడు జ్యేష్ఠుడు అనీ అందరికన్నా గొప్ప అయినవాడు అనీ నీవే ఇదివరకు నాతో చెప్పుతూ వచ్చినావే— ఆ చెప్పినమాటలు అన్నీ ఇచ్చకాలేనా. నన్ను సంతోషపెట్టడానికో రాముడిచేత సేవ చేయించుకోడానికో చెప్పిన కల్లబొల్లి కబుర్లేనా. అట్లా కాకపోయినట్లయితే రామాభిషేకం అని నీకు తెలియగానే దుఃఖతాపముతో ఈ క్రోధాగారములోకి ఎందుకువచ్చినావు. నీవు ఎందుకు దుఃఖపడుతున్నావు. నన్ను ఎందుకు దుఃఖపెట్టుతున్నావు. ఎవరు అయినా నీకు దుర్బోధ చేసిఉండవలెను. లేదా కంటికి అగుపించని పిశాచాలు అయినా నిన్ను ఆవహించి ఉండవలెను.

"ఓ కైకా, నీవు ఇంతవరకూ బుద్ధిమంతురాలవుగా ప్రవర్తించినావు. ఇప్పుడు నీకు విపరీత బుద్ధి పుట్టింది. నీ నుంచి ఈ ఇక్ష్వాకువంశానికి అనర్థము రాబోతున్నది. ఓ విశాలాక్షీ, నీవు ఇదివరకు ఒక్క అనుచితము అయిన పని చేసి ఎరగవు. ఒక్క అప్రియము ఆడి ఎరగవు. నీవు ఇప్పుడు ఇట్లా కోరుతూ ఉంటే నేను నమ్మలేకుండా ఉన్నాను. ఓ చిన్నదానా, నీవు అనేకమార్లు నాతో రాముడూ భరతుడూ నీకు సరిసమానులేనని చెప్పినావు. ఓ రాణీ, నీవు ధర్మభీతి కలదానవే— ఇప్పుడు ఆ ధర్మభీతి ఏమి అయిపోయింది. పరమ ధార్మికుడు అయిన రాముణ్ణి పధ్నాలుగు సంవత్సరాలు అరణ్యవాసము చేయించమంటున్నావా ఆ యశస్వి ఏమి తప్పుచేసినాడు. వాడు—ఆ కుసుమ కోమల శరీరుడు—ఆ సుందరాకారుడు — రాముడు నీకు ఎప్పుడూ భరతుడికన్నా ఎక్కువగా సేవచేస్తూ వచ్చినాడే. వాణ్ణి ఎందుకు అడవులకు వెళ్ళగొట్టమంటున్నావు. ఇప్పుడు కొత్తగా భరతుడిలో నీకు అతిశయము ఏమి కనిపించింది—వాడికి యువరాజ్యాభిషేకము చేయమంటున్నావు. ఓ శుభాంగీ, రాముడు నీకు సేవచేయుటము ఒక్కటేకాదు. నిన్ను గౌరవిస్తున్నాడు. పూజిస్తున్నాడు. నీవు చెప్పినట్టు చేసేవాడు వాడుతప్ప మరిఎవరూ లేరు. వాణ్ణి ఎందుకు అడవులకు పంపించమంటున్నావు.

"ఓ కేకయరాజపుత్రీ, ఈ రాజనగరులో ఎన్నో వేలమంది స్త్రీలుఉన్నారు. ఇంకా ఎన్నో వేలమంది సేవకులు ఉన్నారు. వారిలో ఎవరుఅయినా రాముడిలో ఒక్క తప్పుపట్టినారా. ఒక్క అపవాదుఅయినా వేసినారా. రాముడు పవిత్రుడు, సమస్త ప్రాణికోటినీ సంతోషపెట్టుతూ ఉన్నాడు. సర్వ జన

## కీలుబొమ్మ

(5 వ పేజీ తరువాయి)

ఈయన ఇచ్చుకున్నారన్నమాట."

* * *

తల్లీ కూతురూ భోజనం చేసి మధ్య హాల్లో కూర్చొని కబుర్లు చెప్పుకుంటున్నారు.

"నీ పెళ్ళికి చేసిన అప్పులు కాని చెల్లు పెట్టలేదు. ఆయన కాధ్యాసే ఉన్నట్లులేదు. ఆ ప్రస్తావన తేవటానికి భయం. అదే తీరుతుంది లెద్దూ అంటారు. వాళ్ళుమటుకు ఊరుకుంటారా? కబురుమీద కబురు చేస్తున్నారు. వాళ్ళొచ్చారంటే పిల్లిలాగ పెరట్లోకి పోయి దాక్కొని నన్ను లేరని చెప్పమంటారు. ఇంటిమీద అరవై ఒస్తుందా పైన జీతం ఒంద. ఈపాటి అప్పు తీర్చటం ఏమంత కష్టంకాదు. అయితేఎంత డబ్బూ ఈయన దేశసేవకే సరిపోతోంది. ఆరోగ్యానికి మటుకు ఇలా ఎండని కొంపనీ తిరిగితే పాడయిపోదూ!"

"సరస్వతమ్మ అందుకుంది" అయినా ఇప్పట్నుంచి జాగ్రత్తపడి నాలుగు రాళ్లు వెనకేసుకోకపోతే ముందుముందు ఎలా గడవటం. ఒచ్చే వయసా పోయే వయసా?"

తల్లి కంటి వెంట కన్నీరు కారటం గమనించిన సరస్వతమ్మ గాభరాపడింది. "అదేవిటే ఇది మరీబాగుంది. ఈ త్రివే ఎందుకిలా కంట నీరు బెట్టుకుంటావు. తల భారం చేస్తుంది" అంటూ అనునయించబోయింది.

సాయంత్రం అయిదుగంట లయినా తండ్రి పట్నంనించి రాకపోవడంతో సరస్వతమ్మ తన కాపురానికి అన్న ప్రాప్తి లేదు కాబోలనుకుంది.

"పోయి అబ్బాయమ్మని అడిగి పట్రా" అంది తల్లి.

"ఈపూటకి భోజనం అయినామాను పంటానుగాని చస్తే మళ్ళీపోను." అంది సరస్వతమ్మ.

"ఇకముందెప్పుడైనా పుట్టింటికి రాదల్చుకుంటే ఓ బస్తాబియ్యంకూడా తెచ్చుకో. ఈ ఉపవాసాలు తప్పతాయి."

అలాగేఉంది చూస్తే "అంటూ పెద్దగా నవ్వేసింది సరస్వతమ్మ.

దీపదీపాల వేళవరకూ తండ్రికోసం ఎదురుచూస్తూనే ఉంది. సన్న సన్నగా వానతుంపరఆరంభమయింది.

సరస్వతమ్మ హాలుమధ్యలో కూర్చొని చిమ్నీ తుడుస్తోంది. తల్లి గదిలో మంచంమీద పడుకునిఉంది.

గోవిందరావుగారుగజగజవణుకుతూ మూలుగుతూ వచ్చి మంచంమీద చారబడి "ఈపూట భోంచేయనే. ఒంట్లో బాగులేదు. పులకరంతగిలినట్టుగాఉంది" అన్నారు.

ఈ గొంతు విని హాల్లోనుంచి సరస్వతమ్మ గదిలోంచి భార్యా ఒకేమారు మంచం దగ్గరకు పరుగెత్తారు.

"ఏవిటే అంతకంగారు. కొత్త నలతగా ఉందనగా నేవిటిలా పరుగెత్తుకొచ్చారు. నాకేవీ ప్రాణాపాయం లేదు గాని నువ్వుకొత్త వేణ్ణీళ్ళు కాచిపెట్టు స్నానం చేస్తాను" అని పురమాయించారు.

"మధ్యాహ్నం భోజనం చేసారా?" అడిగింది భార్య.

"హోటల్లో భోజనం నాకు సరిపడదే. ఓ పూట అన్నం తినకపోతే కొంపమునిగిపోతుందా. అదీ కాకుండా దగ్గిర డబ్బుకూడా సరిపడేసంత లేదు. ఎండలో తిరిగానేమో నీరసం వచ్చేసింది"— కనీసం ఈ మనిషికి అబద్ధం ఆటమన్నా తెలియదేమో అనుకుంది సరస్వతమ్మ.

"వాళ్ళేమీ ఖర్చు కింద ఇవ్వలా?" అని అడిగింది సరస్వతమ్మ.

"ఛా! ఇస్తేమటుకు పుచ్చుకుంటావా? అంత కంటే హీనమైన పనుండదన్నట్టుగా" అన్నారు గోవిందరావుగారు.

"అయితే మాతో అబద్ధం ఆడి వుండాల్సింది"

"ఏమని?"

"వాళ్లు ఒంద రూపాయి లిచ్చారు. మహారాజులాగా జేబులో వేసుకున్నాను. మధ్యాహ్నం సుష్టుగా భోంచేశాను. హాయిగా రిక్షాల్లో తిరిగాను అని చెప్ప ఉండాల్సింది"

"ఎందుకని?" అనాయకంగా ప్రశ్నించారు గోవిందరావ్ గారు.

"ఎందుకా ఈ దుస్థితికి బాధపడే అవసరం మాకు తప్పేది. నువ్వే దోలోకాన్ని ఉద్ధరిస్తున్నాననుకుంటున్నావు. నిన్ను నువ్వు ఉద్ధరించుకోలేనివాడు, ఎంతకాలమని ఇలా పరోపకారం చెయ్యగలనో నాకర్థం కావటంలేదు. నీగురించి కష్టపడుతున్న వాళ్లు కొంతమంది ఉన్నారు. వాళ్ల గురించి కూడా నువ్వ ఆలోచించని నాడు, ముందు ముందు మన శ్శాంతి కూడా దూరమై పోతుంది. అప్పుడు బాధపడుతావు"

"అదేవిటే అలాగంటావు. మనం ఏ వ్యవహారంలో నన్నా వేలు పెట్టాలి గాని అట్లో ఇట్లో తేల్చందే వైటికి రాను. పట్నం వెళ్ళిన పని పూర్తి చేసుకొచ్చాను. నేనెళ్ళబట్టే యీ వ్యవహారాలు సైసలా అయ్యాయి. లిప్మెంకి సగం వాటా ఇవ్వటానికి వాడు అంగీకరించాడు. రంగారావు చెల్లెలికి సంబంధం నిశ్చయం చేసుకొచ్చాను. మన పలుకుబడి అంటే ఏవిటో నీకింకా బోధపడలేదు."

సరస్వతమ్మ తల కొట్టుకుంటూ పెరట్లోకి వెళ్లి పొయ్యిమీద నీళ్లుపడేసి వచ్చేసరికి గోవిందరావ్ గారు ఎక్కడికో బయల్దేరే ఉన్నాం. గొడుగు సంపాదించుకుంటున్నారు.

"ఆజన్మిలో ఎక్కడికి చెప్పడం?"

అంది ఆశ్చర్యంగా సరస్వతమ్మ.

"రంగారావు దగ్గిరకి వెళ్లొస్తా"

"ఎందుకిప్పుడు యీవానలో?"

"ఫర్వాలేదు లెద్దూ ఈపాటి వానకూ లెఖ్ఖచేస్తానా. సంబంధం నిశ్చయంచేసుకొచ్చానని చెప్పొస్తా. ఈ విషయం తెలుస్తే వాళ్ళొక్కసారి ఆనందంలో ఉక్కిరి బిక్కిరి అయిపోరుటే ఏవంటావు?"

ఈధోరణికి సరస్వతమ్మ నోటమాట పెగల్లేదు. ఏవిటా ఉత్సాహం! వెర్రి ఆనందం;......గోవిందరావుగారు మూలుగుతూనే గుమ్మందాటారు.

సరస్వతమ్మ బియ్యం వాట మర్చిపోయింది. తరువాత జ్ఞాపకం వస్తే వానీలే ఒక్కపూటకి భోజనం లేకపోతే కొంప మునిగిపోదులే" అని సర్దుకుంది. కడుపులో పేగులు అరుస్తున్నాయి.

ఈవాన జల్లులో, చెమ్మలో నలతగా ఉందనుకున్న మనిషి ఇప్పుడిలా వెళ్లాల్సినంత అగత్య మేమిటి? అయనెందు కింతగా తాపత్రయ పడతారు? ఎవరిదో ఆస్తికి సంబంధించిన తగాయిదా పరిష్కారం అయిందన్నా, ఎవరికో పెళ్ళి సంబంధం నిశ్చయం అయిందన్నా ఈయనింతగా గర్వం చూప్పిన అవసరం? ఆవెళ్ళటంలో ఉత్సాహం సంతోషం, ఉద్రేకం, ఈసుభవార్త వెంటనే వాళ్ళ చెవిని వెయ్యాలనే తహతహ-ఒకవేళ తన్ని వాళ్లు ముందు ముందు లోకువచేసి అయినదానికీ కానిదానికీ వట్టి చాకిరీ చేయించుకుంటారేమో అనే దూరపాలోచనా, వ్యక్తిత్వం లేని అమాయకత్వం—సరస్వతమ్మ ఏధి గుమ్మంలో నిలబడి ఆలోచించుకుంటోంది.

వీధి దీపాలు మసక మసగ్గా వెలుగుతున్నాయి. ఆకాంతిలో కొండ చిలవలా పడుకున్న తారు రోడ్డు మీద అడుగులో అడుగు వేసుకుంటూ నడుస్తున్న గోవిందరావ్ గారుసందుమలుపు తిరిగేవరకూ సరస్వతమ్మ చెమ్మగిలిన కళ్ళతో గమనిస్తూనే ఉంది.

"ఏం అంత గొప్పవారు లేరండీ" అని ఎవరైనా అంటే అందుకోడానికి ములగచెట్టెక్కించే వాడికైతే అతని ప్రవర్తన చాలా విచిత్రంగా ఉంటుంది. అతనిగురించి ఏర్పడ్డ అభిప్రాయాల ప్రభావం అతని మీద బాగా పనిచేస్తాయి. ఈ అభిప్రాయాలు నాటికి నాటు పెళ్లనా సత్యసన్ని హితమైనవని బుజం ప్రకాశంకోటానికి వాటికి అనుగుణంగా నడుచుకుంటూ తాపత్రయపడుతుంటాడు.

గోవిందరావ్ గారు ఈ కోవకు చెందిన మనిషే!

## గ్రంథసమీక్ష

### హృదయేశ్వరి

తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి. ప్రకాశకులు: సాహితీసమితి, తెనాలి, గుంటూరుజిల్లా. వెల: రూపాయిన్నర.

ఇది ఈ కావ్యానికి ద్వితీయముద్రణము. ప్రథమ ముద్రణం ప్రచురించి అప్పటికే సుమారు పాతిక ఏళ్లయింది. ఈ ఇరవైయైదు సంవత్సరాలలోను నేటి కవిత్వంలో అనేకమైన దృక్పథాలేర్పడ్డాయి.

ఈ దృక్పథాలవల్ల ఆనాడు ఇరవైయైదు సంవత్సరాలకుపూర్వం ప్రచురించిన అధునిక కవిత్వం మీదకూడా కొంతకొంత పునర్విమర్శన జరుగుతున్నది.

ఆ రోజుల్లో హృదయేశ్వరికూడా ఆధునిక కవిత్వపద్ధతిలో కొంత సంచలనం కలిగించింది. పాఠకులందరికీ ఆ రోజుల్లో ఇది రచనావిధానంవల్లనైతే నేమి, కథావస్తువువల్లనైతేనేమి ఒక వినూతనకావ్యంగా భాసించింది. క్రమంగా ఈ రకం కవిత్వధోరణికి అనేకమైన అనుకరణలు బయలుదేరడంవల్ల కాలపరిణతివల్ల పాఠకలోకంలో ఈ ధోరణిమీద ఒక విధమైన అరుచి బయలుదేరింది. ఇలాగ కొన్ని తరాలు గతించిపోయేసరికి ఆయాకాలాలలో బయలుదేరిన కావ్యాలు గూర్చిన పునర్విమర్శలు బయలుదేరుతూండడం సహజమే.

ఈ విధమైన తాత్కాలికమైన అభిరుచులతో కూడిన దృక్పథాలతో కాకుండా కొంతలోతుగా పరిశీలిస్తే ఈ కావ్యం నూతనాంధ్ర కవితా వాఙ్మయంలో చిరకాలం పరిస్మరింపదగిన కావ్యంగా నిలిచిపోగలదని చెప్పవచ్చును.

అయితే ఈ రకం కావ్యాలలో చెప్పదగినంత కథావస్తువేదీ కనబడక పోవడంవల్ల భిన్నాభిన్నమైన మనఃప్రవృత్తులు గలవారికి సులభంగా అవగాహన కావు. ఇది నేటికాలంలో కవిత్వావహనలో ఏర్పడుతున్న సమస్యగా నేటి విమర్శకులందరు అంగీకరిస్తున్నారు.

అయితే వీరి కవిత్వంలో పదపదార్థాల సమన్వయంలో అంత చెప్పదగిన క్లిష్టత ఎక్కడా కనిపించదు. దూరాన్వయ క్లిష్టాన్వయాలవంటి వసతే కనిపించవు.

అయితే కావ్యంలో కొన్ని కొన్ని చోట్ల శైలి ఉదాత్తంగా సాగిపోతూ ఒక్కసారిగా నేలమీద చతికిలపడుతూంటుంది. ఈ క్రింది ఉదాహరణలో ఈ విషయం గమనించవచ్చును.

'మినుకు మినుకని చుక్కలు
మెరయుచుండె
ఆవరించెను చిరుమబ్బు లాకసమ్ము
నెదురుగా దోచుచుండె మహీధరమ్ము
లుభయపార్శ్వల శోభిల్లెనుర్విజములు
శాంతరమ్యతమస్వినీ సమయమందు
కలరవంబైన బందరు కాల్వలోని
నీరరేఖను ప్రాపించి కూరుచుంటి
ప్రాణసఖుతోడ ఘట్టాన పడవమీద'

ఇక్కడ మొదటపద్యంలోని ఉదాత్తత రెండోపద్యంలో 'బందరుకాల్వ' 'పడవమీద' అనేసరికి బాగా దెబ్బతిని పడిపోతుంది.

స్వల్పంగాఉన్నా ఇలాంటి దోషాలు శైలీగౌరవం తగ్గించివేస్తాయి.

ఈ కావ్యంపోను ఉదాత్తమైన చివరిచివరి ఘట్టాలలో పాఠకులకు స్వాదువైన కావ్యానుభూతి కలిగిస్తుంది.

అధునిక కవితాపరిణతి అవగాహన చేసుకోదలిచినవారందరికీ ఇది అవశ్య పఠనీయమైన కావ్యము.

* * *

### జ్యోతిష్మతి

శరచ్చంద్రచటర్జీ అనువాదం దిగవల్లి శేషగిరిరావు. నవభారతీ ప్రచురణ. ప్రకాశకులు దివైరైట్ ఏజెన్సీస్ తిలక్ పేట బకింగ్ హామ్ పేట పోస్టు విజయవాడ వెల రూపాయిపావలా.

ఇది శరత్ బాబు వ్రాసిన 'సమాజ్ కా అత్యాచార్' అనే నవలకు అనువాదమని ప్రకాశకులు తెలియజేస్తున్నారు.

ఇందులో జ్యోతిష్మతి అనే వేశ్య కథానాయిక. ఈ కారణమువల్లనే అనువాదకులీ అనువాదానికీ పేరుపెట్టి ఉండవచ్చును.

జ్యోతిష్మతి సామాన్య సంసారంలో పుట్టిపెరిగిన బ్రాహ్మణ బాలిక. ఆమె ప్రేమించిన వ్యక్తిని వివాహమాడడానికి అనేకమైన విఘాతాలేర్పడతాయి. చివరికామె నొక జమీందారు కిచ్చి వివాహంచేస్తారు. అక్కడకూడా ఆమె జీవితం దుర్భరంగా తయారౌతుంది. అలాగగలాగ ఆమెజీవితంలో అనేకమైన క్లిష్టపరిస్థితు లెదుర్కొంటూ చివరికి కలకత్తాలో వేశ్యావృత్తికి లొంగిపోతుంది. కాని కొంతకాలానికి ఆ వృత్తిమీదకూడా విసుగుపుట్టి మళ్ళీ సన్మార్గంలో ప్రవేశించి తీర్థయాత్రలకు బయలుదేరి వెళ్లిపోతుంది.

ఈవిధంగా ఈమెదరిత్ర అంతా శరచ్చంద్రచటర్జీ చాలా విషాదకరంగా చిత్రించాడు.

శరచ్చంద్రచటర్జీ వ్రాసిన నవలలన్నీ చాలావరకు తెలుగులోకివచ్చాయి. శరచ్చంద్రచటర్జీ వ్రాసిన నవలలో ఈ నవలపేరు కనబడడంలేదు. ఈ పరిస్థితుల్లో ఈ నవల ఈ పేరున్నమరి ఒక రచయిత వ్రాసిన నవలకు అనువాదమేమోనని అనుమానం కలుగుతున్నది.

అయితే పుస్తకంమీద ప్రకాశకులు ప్రత్యేకంగా శరచ్చంద్రచటర్జీ రూపచిత్రంకూడా ముద్రించారు. ఇలాంటి ప్రఖ్యాత రచయితనవల ప్రకటించేటప్పుడు ప్రకాశకులు పీఠికలో మూల రచననుగురించి సంగ్రహంగానైనా తెలియజెయ్యడం న్యాయ్యం. అలాంటి పీఠిక ఏదీదీనిలో లేదు. ఇదిగాక శరచ్చంద్రచటర్జీ పరిణత రచనాశక్తి దీనిలో అంతగా ప్రస్ఫుటంగా కనిపించడంలేదు. బహుశః ఇది శరచ్చంద్రచటర్జీ మొదటిరోజుల్లో వ్రాసిన నవల కావచ్చును.

అనువాదం మొత్తంమీద సాఫీగా నడిచిపోతున్నది.

దీనిలో అక్కడక్కడ దొర్లిన 'తేజోతరంగం'వంటి అపశబ్దాలు, అసాంప్రదాయికమయిన వాక్యవిన్యాసాలు కనిపిస్తున్నాయి. అనువాదకు లిలాంటివన్నీ ముందు ప్రచురణలోనైనా సవరించుకోగలరని ప్రఖ్యాత రచయితల రచనలు తెలుగులోకి అనువదించేటప్పుడు తీసుకోవలసిన జాగ్రత్తలన్నీ తీసుకోగలరనీ ఆశిస్తున్నాము.

* * *

### దరిద్ర నారాయణ

[వారపత్రిక]

సంపాదకులు: శ్రీ ఎర్నేని సుబ్రహ్మణ్యం. శ్రీ గాంధీఆశ్రమం. గాంధీపురము. విడిపత్రిక వెల రెండణాలు. సంవత్సరచందా ఆరురూపాయలు.

ఇదే విస్మృతప్రాయమౌతోన్న గాంధీజీ ఆదర్శాలను జనసామాన్యంలో ప్రచారం చేసే ఉద్యమంతో ప్రారంభించిన వారపత్రిక.

ఈ పత్రిక మొదటి రెండు సంచికలలోను, గాంధీజీ ఆదర్శాలను గురించిన రచనలేగాక, వినోబాభావే భూదానోద్యమాన్ని గురించీ, ఇంకా తదితర విషయాలను గురించి రచించిన వ్యాసాలుకూడా ఉన్నాయి.

* * *

1. జనాసు పల్లెల వరినాటు
2. పోలీసులు: ప్రజలు
3. వెనుకబడిన వర్గాల వికాసం
4. భూములులేని పేదలకు ప్రభుత్వ భూములు.
5. ప్రజారోగ్యము
6. జాతీయప్రణాళిక ఉద్యమం

పై ఆరు ఆంధ్రప్రభుత్వ సమాచార శాఖవారు ఆయా విషయాలను గురించి ప్రచురించిన కరపత్రాలు.

ఈ కరపత్రాలు కావలసినవారు ఆంధ్రప్రభుత్వ సమాచారశాఖ వారికి వ్రాస్తే లభిస్తాయి.

## సినిమా

### నగరంలో సినిమాలు

| | | |
|---|---|---|
| శ్రీకృష్ణా, వెలింగ్టన్, సయాని | టూప్పుటూప్పు | (తెలుగు) |
| క్రౌన్ | భక్తసారి | ,, |
| గెయిటీ | పణం | ,, |
| రాజకుమారి, మహారాణి | దేవదాసు | ,, |
| ఈరాస్, పారగన్, బ్రాడ్వే | తులసిదళం | ,, |
| కాసినో, ప్రభాత్, సరస్వతి | మల్లెశ్వరి | ,, |
| సన్ | మదనమోహిని | ,, |
| స్టార్ | ఆహా | (హిందీ) |
| అశోక్ | బాబాచాదరి | ,, |
| సెలెక్టు | గూంజ్ | ,, |
| ప్లాజా | పామాపత్యాసా | ,, |
| మినర్వా | Pickpocket | |
| న్యూఎల్ఫిన్స్టన్ | Return to paradise | |
| న్యూగ్లోబ్ | powder river | |
| ఓడియన్ | Noaked Jungle | |
| కేసినో | Shane | |
| రాక్సీ | Decameron nights | |

### శోభ

ముదునూరు బోర్డు హైస్కూలుసారస్వత సంచిక. సంపాదకుడు శ్రీ ముదునూరు వెంకటేశ్వరరావు. శ్రీ మహాదేవ విద్యాపీఠము, ముదునూరు కృష్ణాజిల్లా.

### ప్రణవగణపతి

[త్రివర్ణ చిత్రము]

చిత్రకారుడు: ఎస్. మణియం.

చిత్రాలకు హిగిన్ బాదమ్స్ లిమిటెడ్, పోస్టుబాక్స్ నెం. 811. మద్రాసు వెల 8 అణాలు.

### "Roman Law"

[ప్రథమ ద్వితీయ భాగాలు]

రచయిత: విష్ణుగుప్త, ప్రకాశకులు: యస్. యం. రావు, ఆదియప్పనాయక్ వీధి మద్రాసు 1. వెల: ఒక్కొక్క భాగం వెల నాలుగణాలు.

### "Law of Torts"

[ప్రథమ ద్వితీయ భాగాలు]

రచయిత: విష్ణుగుప్త, ప్రకాశకులు: యస్. యం. రావు, ఆదియప్ప నాయకన్ వీధి, మద్రాసు 1. ఒక్కొక్క భాగం వెల నాలుగణాలు.

### "Law of Contracts"

రచయిత: విష్ణుగుప్త, ప్రకాశకులు: యస్. యం. రావు, ఆదియప్పనాయక్ వీధి మదరాసు 1. వెల నాలుగణాలు.

### "Which Case to Quote and When?"

[ప్రథమ ద్వితీయ భాగాలు]

రచయిత: విష్ణుగుప్త, ప్రకాశకులు, యస్. యం. రావు, ఆదియప్పనాయక్ వీధి, మద్రాసు 1. వెల నాలుగణాలు.

### గ్రామాయణం

'అరుద్ర' ప్రకాశకులు: నవోదయ ఎంటర్ ప్రైసెస్ లిమిటెడ్ నవోదయ బిల్డింగ్స్ 21, సుంకు రామ చెట్టివీధి, మద్రాసు 1, వెల ఒక రూపాయి.

రామాయణం లాంటి కథలు మన గ్రామాల్లోకూడా జరగగలవనే వ్యంగ్యంతో రచయిత యీచిన్న పుస్తకం రచించారు. ఈకథ చదువుతూంటే రామాయణగాథే కాక రామాయణంలోని వ్యక్తులుకూడా స్ఫురిస్తూంటారు. కథ ఎత్తుగడలో కొంచయ్య వృత్తాంతం చాలా హుషారుగా సాగిపోతుంది.

కాని కథ గడిచిన కొద్దీ రామాయణకథను అనుసరించాలనే ఉద్దేశిలత్యంవల్ల కథకు కథలోని పాత్రలకు కళ్ళాలు తగిలించినట్టు కనబడుతుంది. చివరి చివరికి వచ్చేసరికి కథ పేలవంగా తేలిపోయినట్లనిపిస్తుంది. కాని పుస్తకం మొదలుపెడితే సుఖంగా చివరిదాకా చదివించివేస్తుంది.

పుస్తకంమీద బొమ్మలేకుండాఅక్షరాలు మాత్రం ఉంచితే యీ పుస్తకం ఇంకా ఆకర్షంగా ఉండేది.

రచయిత కొత్తధోరణిలో చేసిన ప్రయత్నం హర్షించతగ్గదే. అయితే రచయిత పీఠికలో వ్రాసినట్టిది వారి లక్ష్యాలకొక 'బ్లూ ప్రింట్' మాత్రంగానే ఉండిపోయింది.

### ఉదయకిరణాలు

[గేయమాల]

కళాధరవి: ప్రచురణ నవసరస సాహితీ సమితి, లీలా ప్రెస్, విజయవాడ మూల్యం, 8 అణాలు.

ఇది కేవలం యీ రోజుల్లో వ్రాసే మాత్రాచ్ఛందస్సుల ధోరణిలో వ్రాసిన ఖండకావ్యాల సంపుటి.

దీనిలో అంతటా అభ్యుదయానికి భావాలుకనిపిస్తున్నాయి. గాని వీటిల్లో కవిత్వం మాత్రం చాల స్వల్పం ఉన్నవాటిలో సానెట్ అనే కావ్యంలోను ఎన్ని గంటలు అనే ఖండికలోను మాత్రం కొంత కవిత్వచ్ఛాయ సందించి.

# ఆడిట్ - అకౌంట్

## శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య

ఆడిట్, అకౌంట్సు శాఖలను విడదీయాలని భారత ప్రభుత్వం చేసిన నిర్ణయం అనతికాలంలోనే అమలులోకి రాగలదని రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ జూలై 21 న ఢిల్లీలో ఆడిటర్ జనరల్ కార్యాలయ భవనానికి శంకుస్థాపన చేస్తూ అన్నారు.

ప్రతి ప్రభుత్వానికి ఆడిట్, అక్కౌంట్సు శాఖలు ప్రభుత్వ వ్యయాన్ని పరిశీలించుతుండడం వాటిలో జరిగే లెక్కల వ్రాత అంత సరిగా వుందా లేదా అని అక్కౌంటుశాఖ గమనించి, సక్రమంగా వ్యయం చేసిందా లేదా అని ఆడిట్ శాఖ నిర్ణయించుతుంది. ఇందుకై 1858 లో ఈస్టిండియా కంపెనీనుంచి దేశపరిపాలన బ్రిటిష్ ప్రభుత్వానికి అధీనమయినప్పుడు ఆడిట్, అక్కౌంటు శాఖలు విడివిడిగా వుండేవని, ఒకదానికొకటి చెక్ బందీగా వున్నవని తలంచడంవల్లనేమో 1860 లో ఒకటి చేశారు. మరల యీనాడు భారత ప్రభుత్వం యీ రెండు శాఖలను విడివిడి చేయాలని తలుస్తున్నదని రాష్ట్రపతి ప్రకటించారు.

ఈనాటి భారత రాజ్యాంగం ప్రకారం 148 వ ఆర్టికల్ ననుసరించి ఇండియా మొత్తానికి కంట్రోలు అండ్ ఆడిటర్ జనరలును ఒకనిని రాష్ట్రపతి నియమిస్తారు. వారు 1935 వ ఆక్టులో చెప్పబడిన విధంగా చేస్తున్న పనులనే ఇప్పుడూ చేస్తుంటారని 149 లో నిర్ణయించబడింది. పార్లమెంటు, రాష్ట్రాలు నిర్దేశించిన లెక్కలను వీరు పరిశీలించుతుంటారు. కేంద్రప్రభుత్వం రాష్ట్రప్రభుత్వాలు కంట్రోలరు నిర్ణయించిన విధంగా లెక్కలు నిర్వహించాలెనని ఆర్టికల్ 150 ద్వారా సిద్ధించుచున్నది.

151 (1) ననుసరించి కంట్రోలరు ఆడిటర్ జనరల్ ఇండియా ప్రభుత్వపు లెక్కల పరిశీలన నివేదికను రాష్ట్రపతికి పంపవలెను. రాష్ట్రపతి పార్లమెంటుముందు ఆ నివేదికను ఉంచవలెను, అటులే 151 (2) ననుసరించి యీ ఆడిటర్, జనరల్, కంట్రోలరు రాష్ట్రప్రభుత్వాల లెక్కలను గవర్నరు లేక రాజప్రముఖులకు అందచేయవలెనని, వారు తమ తమ రాష్ట్ర శాసనసభలకు ఆ నివేదికలను అందచేయవలెను.

ఇండియా మొత్తం లెక్కలను కంట్రోలరు-ఆడిటరు జనరల్ పరిశీలిస్తే రాష్ట్రాల మొత్తాల పరిశీలనను రాష్ట్రంలో వీరి శాఖలుగా రాష్ట్రంలో అకౌంటెంట్ జనరల్ ను నియమిస్తారు. అయితే 1935 ఆక్టులో వీరి నియామకం ప్రత్యేకంగా 167 సెక్షను ద్వారా నియమించడం జరిగింది. ఆ విధంగా కాకుండా సరాసరి ఇండియా మొత్తానికి ఒకే ఆడిటర్ జనరలు అతనికి శాఖలుగా యీనాటి రాజ్యాంగం నిర్ణయించడం జరిగింది. ఇంతవరకు కంట్రోలరు, ఆడిటర్ జనరల్ ఒకరుగానే వుంటున్నారు. ఈనాడు యీ కంట్రోలరు వేరుగాను, ఆడిటర్ జనరల్ వేరుగాను నిర్ణయించబోతున్నారు.

ఈ లెక్కల పరిశీలన ఎప్పటికప్పుడు అక్కౌంటెంట్ జనరల్ చేయడం అవసరమేఅయినా పార్లమెంటరీ చెక్కింపు ప్రజాప్రతినిధుల తనిఖీకి అవకాశం చాలా తక్కువగా వుండడం విచారనీయం.

ఈపైన ఉదహరించిన ఆర్టికల్ల ప్రకారం యీ అకౌంటు జనరల్, ఆడిట్ రిపోర్టును గవర్నరు ద్వారా శాసనసభలకు, రాష్ట్రపతి ద్వారా పార్లమెంటుకు అందజేస్తారు. అంతవరకు సరిగనే కనిపించవచ్చు. యీ వచ్చిన నివేదికలను యీ ప్రజాప్రతినిధులు యేమిచేస్తారు, చేయగలరు అనేది ముఖ్యం.

లోక్ సభా నిబంధనలు 237, 238 ల ననుసరించి ప్రజాసభ ఒక పబ్లిక్ అక్కౌంట్ కమిటీని సెంట్రల్ ట్రాన్స్ ఫర్ బుల్ వోటింగులో 15 మంది సభ్యులతో ఎన్నుకొంటుంది. యీకమిటీకి పంపబడిన లెక్కలు గమనించి (1) అందులో చూపిన లెక్కలు న్యాయశాస్త్రరీత్యా పనిచేసిన వారికివ్వబడినవా, (2) ఆపనిచేసిన అధికారికి ఉద్దేశించిన పనులకే వినియోగించారా. (3) సరియగు అధికారి వల్ల చేయబడిన రూల్సుల ననుసరించే వ్యయం చేయబడినవా పరిశీలించుతారు. మరియు ప్రైవేటు వ్యాపార సంస్థలు, ఉత్పత్తి పథకాలు, ప్రాజక్టులు మున్నగువాని అంకెలు ఆదాయ వ్యయాలు పరీక్షించవచ్చు. యీ కంట్రోలరు ఆడిటర్ జనరలు సరిచూసిన స్వతంత్రసంస్థల లెక్కలను పరీక్షించవచ్చు, స్టోరులు, సామగ్రులు పరిశీలించమని రాష్ట్రపతి అడిగితే అందుపై ఆడిటరు జనరలు పంపిన లెక్కలు పరీక్షించవచ్చు. పార్లమెంటు నిర్దేశించిన మొత్తాలకన్నా అధికంగా వ్యయం చేసినట్లయితే అందుకుగల కారణాలను ప్రతిపద్దు క్రింద పరిశీలనచేసి తగువిధముగా సలహాలు యివ్వవచ్చు.

ఇక రాష్ట్రశాసనసభల విషయంలో ఆలోచించితే రాష్ట్రశాసనసభలు మన శాసనసభా 138 రూల్సు ప్రకారం 15 మంది సభ్యులతో ఒక పబ్లిక్ అక్కౌంట్సు కమిటీని సింగిల్ ట్రాన్స్ ఫరబుల్ వోటుతో ఎన్నుకోవచ్చు. ఇదే విధంగానే వీరు రాష్ట్ర ఆదాయవ్యయాలను పరిశీలించవచ్చు.

అయితే వీరు పరిశీలించే లెక్కలు ఎప్పటివి, ఎప్పుడు చేయగలరనేది చాలా ప్రధానంగా గమనించవలసివుంది.

ఈ పబ్లిక్ అకవుంటు కమిటీ విసంవత్సరం లెక్కలు, కనీసం క్రితం సంవత్సరం లెక్కలు కాకుండా 4 సంవత్సరాల క్రిందట లెక్కలు తనిఖీ చేస్తుంటుంది. అందుకే దీనిని శవపరీక్ష కమిటీ అని నవ్వు క్రింద అంటూంటారు కూడా. మద్రాసు ఉమ్మడి శాసనసభలో 1949-50 సంవత్సరాల లెక్కలు పరిశీలన జరిగింది. 1953 లో ఆంధ్రరాష్ట్రం వచ్చింది. ఆంధ్రరాష్ట్రం ఏర్పడగానే ఒక అకవుంటు కమిటీని ఎన్నుకున్నారు. మరల నూతనబడ్జెటు 1954 ఫిబ్రవరి మార్చిలలో చర్చలు జరిగినవి. అప్పుడే మరల కమిటీని వేశారు. ఆకమిటీ పరిశీలించుటకు ఆడిట్ రిపోర్టుతో సహా 1950-51 అంచనాలు, వ్యయం శాసనసభకు అందించారు. ఈ కమిటీ 1954 మార్చి నెలలో ఎన్నుకోబడింది.

ఈకమిటీ పనినిగురించి మద్రాసు బడ్జెటు మాన్యువల్ 9 వ అధ్యాయంలో వివరించబడింది. ఈవిధంగా ఇది ఆడిట్ మాన్యువల్ లో నిర్ణయింపబడినందువల్ల శాసనసభ ఎన్నుకున్న ఇతర కమిటీల ప్రచురణలోనూ దీని ప్రచురణలోనూ ప్రత్యేకత చూపింపబడుచున్నది. ఇది శాసనసభ ఎన్నుకున్న కమిటీఅయినా ప్రభుత్వ కమిటీగా కూడా గుర్తింపబడుచున్నది అందుకే ఈ కమిటీ నియామకం వేరే ప్రత్యేక ఆర్థిక శాఖ వారి జీ. వో. ద్వారా ప్రచురించుట జరుగుతుంది. ఆవిధంగా ఈ కమిటీ ప్రచురణను ఈ సంవత్సరం ఆర్థికశాఖ జీ. వో. 215 ది 21-4-54 న ఈ క్రింది సభ్యులతో ప్రకటన జరిగింది. సభ్యులు (1) అధికారరీత్యా, ఆర్థికమంత్రి, శాసనసభచే ఎన్నుకోబడినవారు (2) శ్రీ టి. నాగిరెడ్డి, (3) పిల్లలమర్రి వెంకటేశ్వర్లు, (4) ఖండవల్లి కృష్ణారావు, (5) యస్. వేమయ్య. (6) ముంపవరపు బాపయ్యచౌదరి, (7) పి. వి. జి. రాజు, (8) గౌతు లచ్చన్న, (9) ప్రగడ కోటయ్య, (10) వావిలాల గోపాలకృష్ణయ్య, (11) టి. యర్. వెంకట సుబ్బారెడ్డి, (12) పిడతల రంగారెడ్డి, (13) యం. ఆర్. అప్పారావు, (14) పి. గోపాల కృష్ణారెడ్డి, (15) టి. మల్లయ్య గారు, వీరు 1954-55 ఆర్థిక సంవత్సరానికి పబ్లిక్ అకవుంట్సు కమిటీగా వుంటారు.

మద్రాసు బడ్జెటు మాన్యువల్ 9 వ అధ్యాయం ప్రకారం ప్రభుత్వ కమిటీగా పరిగణింపబడిన ఈ కమిటీ అధ్యక్షుని కోరిక ననుసరించి సమావేశం అవుతుంది. (మద్రాసు) ఆంధ్ర ఏసెంబ్లి రూల్సు ప్రకారం ఈ కమిటీ అధ్యక్షుని సభ్యులు ఎన్నుకోవాలి. లోక్ సభ రూల్సు ప్రకారం లోక్ సభ స్పీకరు ఈ కమిటీ అధ్యక్షుణ్ని నియమించుతారు. అయితే లోక్ సభ ఉపాధ్యక్షులు ఈ కమిటీలో సభ్యులుగావుంటే వారే ఈ కమిటీకి అధ్యక్షులుగా వ్యవహరిస్తారని నియమంవుంది. కొన్ని చోట్ల ప్రతిపక్ష నాయకుడు దీనికి అధ్యక్షుడుగావుండే సాంప్రదాయంకూడా వుంది. కాని మన శాసనసభ రూల్సు ప్రకారం ఒక సభ్యుణ్ణి ఎన్నుకోవాలె. ఆర్థిక శాఖా కార్యదర్శి ఈ కమిటీకి బడ్జెటు మాన్యువల్ రూ. లు 110 ననుసరించి అధికారరీత్యా, కార్యదర్శిగా వుంటారు. శాసనసభచే ఎన్నుకోబడిన శాసన సభాకమిటీకి శాసనసభా కార్యదర్శియే అధికారరీత్యా కార్యదర్శిగా వుంటారు.

ఈ కమిటీకి యేయే విషయాలు చర్చనీయాంశాలుగా వుంచాలెననేది నిర్ణయించేదిగా బడ్జెటు మాన్యువల్ 109 రూ. లు ననుసరించి ఆర్థికశాఖగా నిర్ణయించడం జరిగింది. ఈ కమిటీని వారం రోజుల నోటీసుతో సమావేశ పరచాలి. అధ్యక్షునితో ముగ్గురు ఈ కమిటీ కోరంగా 110 రూ. లు నిర్దేశించబడుతుంది. ఆర్థికశాఖ అకవుంటెంటు జనరల్ సంప్రదింపులతో యేయేశాఖలు, లెక్కలు ఈ కమిటీ పరిశీలనార్థం పెట్టవలెనో తెల్పుకొని ఆయా శాఖలను ఆయావివరాలు పంపవలసిందిగా కోరుతారు. అవి వచ్చిన తర్వాత కమిటీ ముందు పెట్టుతారు. కమిటీ యెవరినైనా పిలిచి సాక్ష్యం తీసికోవచ్చు. ఈ విషయాలన్నీ అవసరంగా మరికొన్ని విషయాలు చర్చకు తీసికోవచ్చునని సభ్యులు కోరవచ్చు. "రూలింగ్సు ఆన్ ఆడిట్ సర్వీసెస్" అనే కంపైలింగ్ లో ప్రభుత్వం అదనంగా రివైజు చేసిన బడ్జెటులో చేర్చని అదనపు వ్యయాన్ని గూర్చి చర్చించేపద్ధతి ఉదాహరింపబడింది. కాని ఈ కంపైలింగ్ లభించడం లేదు.

ఈ సభలో పరిశీలించిన విషయాలు ఒక రిపోర్టుగా వేస్తారు. దానిని శాసనసభ అంగీకరించాలి. ఈ అంగీకారం రిపోర్టులోని విషయాలు పరిశీలించవలసిందిగా వివిధశాఖలను ప్రభుత్వాన్ని కోరుతుంది ప్రభుత్వం. ఆర్థికశాఖ అయిదు సంవత్సరాలు వ్యవధిలో ఈ పబ్లిక్ అకవుంట్ కమిటీల సారాంశాన్ని ప్రచురిస్తుండాలి. కాని ఇది కూడా లభించడం లేదు.

ఈ విధంగా పరిశీలించవలసిన అంకెలు చాలా పాతపడిపోయి వున్నవి. 1954 లో యేర్పడిన కమిటీ 1954-55 లలో 1950-51 సంవత్సరాల లెక్కలు పరిశీలించుతుంది. అంటే దీని ప్రయోజనం యెంత అయిపోతుందో గమనించండి. పంచాయితీబోర్డులు, తాలూకాబోర్డులు, జిల్లా బోర్డులలో ఆట్టే సహకార సంఘాలలో అనవసరంగా వ్యయం చేసినట్లు ఆడిట్ నిర్ణయిస్తే ఆయా జనరల్ బాడీలు, బోర్డులు అనుమతి నివ్వని వ్యయం చేస్తే అనుమతించని మొత్తాలను ఆయా బాధ్యులనుండి వసూలు చేయుటకు సర్ చార్జీ అమలుపరుస్తారు. ఈ మొత్తాలలో సర్ చార్జీ అంటూ ఎన్నడూ లేదు. లెక్కల పొరపాటును, అనవసర వ్యయానికి బాధ్యులెవరో తెలియదు. అదీఅయిదు సంవత్సరాల తర్వాత అంటే ఈలోగా అధికారులు ఎందరు మారిపోతారో, అధికార కీలకాలలో వుంటారో, దురదృష్టవశాత్తు గతించేపోతారో ఊహించితే దీని ప్రయోజనం తెల్పక్కర్లేదు అనిపించుతుంది.

ఇప్పుడు ఆంధ్రరాష్ట్రం విడిపడిన తర్వాత 1952-53, 1953-54 ఇంకా అంతకుముందు సంవత్సరాల డిపార్టుమెంటులు, రిపోర్టులు రావలసివున్నవి. కాని రాష్ట్రం విడిపోవడంతో అవి పంపడం ఆపారు. మద్రాసు ప్రభుత్వ కార్యదర్శినడిగితే మాకూ మీకూ సంబంధం లేదంటారు. ఆంధ్రను అడిగితే మనవద్ద లేవుకదా అంటారు. ఇవి లేకుండా అసలు లెక్కలు యేమి తేలతవి.

ఆంధ్రరాష్ట్రంఆక్టు 46 వ సెక్షను ప్రకారం ఈ లెక్కల పరిశీలనకు ఆంధ్రరాష్ట్రంలో ఒక కమిటీ, మద్రాసులో ఒక కమిటీ యేర్పడితవి. ఈ రెండు పరిశీలన సమిష్టిగా జరిగితే బాగుండేది. అది వీలుకాదంటారు ఆర్థికమంత్రి శ్రీ విశ్వనాథంగారు. ఈ కమిటీలు పరిశీలించేది కలిసివున్న మద్రాసురాష్ట్రం విడికాక అటు నేటి మద్రాసు, ఇటు నేటి ఆంధ్ర లెక్కలయితే ఎవరికివారు చేయవచ్చు గాని కలిసివున్న మద్రాసురాష్ట్రపు 1950-51 లెక్కలు మరియే విధంగా పరిశీలన చేయడం?

అది అటు వదలివేస్తే ఇక ఆంధ్రరాష్ట్రం యేర్పడినతరువాత ఆంధ్రరాష్ట్రం 6 నెలల సంవత్సరాన్ని ఒకదానిని గడిపింది. వాటి లెక్కలలో చాలా అనుమానాలు, శాసనసభను త్రోసివేసి చేసినవి. ఇంకా లెక్కలు తేలలేదని చెప్పినవి, అనేక మార్గాలున్నవి. శ్రీ ప్రకాశంగారిని విధేయుడు అధికారులను ఎందరిని వేశారు. వారి జీతాలు యెంత వ్యయం అయినవి అంటే లెక్కలు తయారుకాలేదని అన్నారు. ఇట్లాంటివే అనేకంవున్నవి. ఈ లెక్కలు ఎప్పటికి తేలడం. ఈ లెక్కలను పరిశీలించగలసంఘం బహుశః 1957-58 సంవత్సరాలలో శాసనసభచే యెన్నుకోబడు పబ్లిక్ అకౌంట్సు కమిటీ అన్నమాట. అప్పటికి అంతా అయిపోయిందనే భావంతో పావుగంటలో దీనిని శాసనసభ అంగీకరించడం జరుగుతుంది. 1949-50 అంకెలు అరగంట చర్చిస్తే యెందుకీ కాలవ్యయం అని కలిసివున్న మద్రాసు రాష్ట్ర శాసనసభలో అనేకులు గోల పెట్టారు. ఆ విధంగావుంటే 1957-58 లలో 1953-54 లెక్కల గతీ అంతే!

అందుకే ఇంత శ్రమపడి [illegible] బడ్జెటు ప్రతిపాదించిన వెంటనే ప్రవేశపెట్టబోయే ముందు శాసనసభ చర్చ చెయ్యడం అవసరం అని అన్నాం. అందుకు లోకసభలో ఎస్టిమేట్సుకమిటీ అని ఒకటి వేయడం జరిగిందని, కొన్ని రాష్ట్రశాసనసభల్లో కూడా ఈ యెస్టిమేట్సు కమిటీలు వేశారని ఆ విధంగా మనం వేసుకుందాం అని చెప్పగా ఇంగ్లాండు పార్లమెంటులో బడ్జెటు ప్రతిపాదించగానే పార్లమెంటు పరిశీలనా సంఘంగా పరిగణించి చర్చించబడుతుందని ఆ విధంగా చేస్తే తప్పేమీ అభ్యంతరం లేదని శ్రీ విశ్వనాథంగారు అన్నారు. కాని అమలు జరగలేదు. అది అంతా మార్పులంటే శాసనసభ చర్చయేకదా. అందువలన ఇంకా కొంతకాలం శాసనసభ చర్చించవచ్చునా, [illegible] అంటారు.

మనం కూడా రాష్ట్ర ప్రభుత్వ బడ్జెటు అక్టోబరు 1 వ తేదికి తయారుచేయడం పూర్తి అవుతుంది. అప్పటికి ఆర్థికశాఖను చేర్చవలసివుంది. ఆ చేరిన లెక్కలను శాఖలవారిగా తయారు చేయడం జనవరి వరకు పట్టవచ్చు. డిసెంబరు ప్రారంభానికి ఒక రూపం దాలుస్తవి. ఆ సమయంలో ఒక్కొక్క శాఖకు సంబంధించిన లెక్కలను శాసనసభ నుండి ఒక్కొక్క శాఖాపరిశీలనకు ఎన్నుకోబడిన అయిదు, లేక యేడుగురు గల ఉపసంఘాల పరిశీలనకు పెట్టి వారిచే కూలంకషంగా చర్చించిన అనంతరం ఎస్టిమేట్సు కమిటీని యేర్పరచి దానిచే సమగ్రబడ్జెటు పరిశీలన చేసిన తర్వాత శాసనసభ ముందు ప్రవేశపెట్టితే ఎంతైనా ప్రజాస్వామ్యంగా వుంటుంది. లోక్ సభలో నున్న ఎస్టిమేట్సు కమిటీ ఎప్పటికప్పుడు లెక్కలు పరిశీలిస్తున్నది. అది ఆదర్శప్రాయంగా చేస్తున్నదని, సమగ్రంగా పరిశీలిస్తున్నదని అనలేకపోయినా, ఒకటి రెండు సందర్భాలలో ఎన్నో యిర్రిగేషన్ ప్రాజెక్టుల సందర్భంలో, దామోదర్ వాలీ ప్రాజెక్టు సందర్భంలో బయటపెట్టింది. అదే పద్ధతి ప్రతిదానిలో జరిగితే బాగుంటుంది ఈ యెస్టిమేట్సు కమిటీ సంవత్సరానికి ఏదో ఒకటి మించితే రెండు శాఖల లెక్కలు మాత్రమే పరిశీలించవలెనని నియమం కూడా సరియైంది కాదు. ఏ శాఖ పడితే ఆ శాఖ, అన్ని శాఖలు పరిశీలించే అవకాశం వుండాలి. ఆంధ్ర శాసనసభలో ఈ పబ్లిక్ అకవుంట్సు పరిశీలన శవపరీక్ష పద్ధతిపోయి సజీవ పరీక్ష చేసి పరిశీలన బహిరంగం అయ్యే ప్రయత్నం తీవ్రంగా సాగి విజయం సాధించాలి. అందుకు ప్రభుత్వం పూనుకోవాలి. ఆంధ్ర ప్రజానీకం ఇందుకు తీవ్ర ప్రయత్నం చెయ్యాలి.

బడ్జెటు మాన్యువల్ 1935 ఆక్టు అంతకు ముందు ఆసుల పరిమితులను అన్వయించి వ్రాయబడినవి. అవి ఈనాటి 1950 రాజ్యాంగం దృష్టిలో పరిశీలించి పునర్ముద్రించబడవలసివుంది. 1950 లో మద్రాసు అకవుంటెంట్ జనరల్ గావున్న శ్రీ పి. కే. వత్తాల్ వ్రాసిన 'ఏవిస్ ఆఫ్ ఇండియన్ గవర్నమెంటు ఫైనాన్సు' అనే పుస్తకం నాటి రాజ్యాంగం లెక్కల కనుగుణంగా తయారుచేసి ఇంకా వివరాలతో ప్రజలకు అందించాలి. రాజేంద్రప్రసాద్ కోరినట్లు ఆడిట్ ను, అక్కౌంటెంట్ జనరల్ శాఖలను కూడా విడదీయాలి. ఈ రెంటి పరిశీలను ఎప్పటికప్పుడు ప్రజాప్రతినిధులు, లేక వారితో యేర్పడిన ఉపసంఘాలు పరిశీలించే అవకాశం కలిగించాలి. ఈ లెక్కలు, ప్రభుత్వ సిబ్బంది, ఆఫీసు నిర్వహణలలో పున:పరిశీలన జరిగి, అందువల్లనూ తేలని లెక్కలు, అసలు బయటకి రాని కొన్ని కొలు, ఎవరికివారే వారికనుకూలంగా వుండే రూల్సులు మారాలి ప్రభుత్వ విధానంలో ఆర్థిక నిర్వహణలలో ప్రజల పరిశీలన (కొరకు) అధికంగా కల్పించుచూ విధానం మార్చాలి.

# ఆంధ్ర కౌలుదార్ల రక్షణ చట్టం-(54)-ఒక విమర్శ

రచన
శ్రీ భాట్టం శ్రీరామమూర్తి

ప్రభుత్వం ప్రకటించిన 'ఆంధ్ర కౌలుదార్ల రక్షణచట్టం (54)' ముసాయిదా పరిశీలిస్తే కౌలుదార్లకన్నా, యినాందార్ల రక్షణే ప్రభుత్వ లక్ష్యంగా విశదమవుతుంది. అసాధారణ గెజెటులో 7 పేజీల్లో ప్రకటించబడిన యీ చట్టంలో రైతురక్షణకు సంబంధించినవి 4 వాక్యాలుమాత్రమున్నవి. "యీ చట్టం అమలులోఉన్న కాలంలో యే కౌలుదారుని 4 వ సెక్షను నిబంధనలకులోబడి, యినాం భూమినుండి తొలగించరాదు" అని చెప్పబడివుంది.

దీనివల్ల కౌలుదారుకు కలిగే రక్షణ, చట్టం అమలులోకి వచ్చిన తర్వాతనే లభిస్తుంది. చట్టం యెప్పుడు అమలులోకి వచ్చేది తెలీదు. చట్టం అమలులో ఉండగా కౌలుదారుని భూమినుండి తప్పించరాదు అమల్లోకి వచ్చేలోగా యే కవులుదారునైనా విరామంగా తొలగించవచ్చు. యిదివరకు తప్పించబడ్డ కేసులు చాలా ఉన్నాయి. వీరిలో యెవరికీ రక్షణ లేదు. 47 సంవత్సరంనుంచి, నేటివరకూ యెన్నో గాలివానలకీ, తుఫానులకి తట్టుకునిలబడ్డ కౌలుదార్లు యికముందు కూడా భూమిగా నిలబడతారనే ఆశ ఉండేది. వారిని తొలగించేందుకు కొందరు యినాందారులైనా జంకేవారు [illegible]

తున్న కౌలుదార్లు వారిసంచెల్లో మిగిలివున్న మొండికొక్కి అంతా కూడదీసి ఖండిస్తే తప్పేముంది? యేలా కాదనగలం?

ఆంధ్ర రైతాంగం కోకే జీవితం ప్రభుత్వం తెలుసుకోవాలి ముందుగా. రైతును భూమినుండి తప్పించకూడదన్న నినాదం సర్వత్రా వినపడుతోంది. అత్యంతం యెంతవరకు సాధించేరో అంటే అదీ యేమీ లేదు. పాని రైతు చెల్లించే శిస్తు విషయంలో, న్యాయం సరసమైన పద్ధతి ప్రవేశపెడతామని [illegible]

తులు బాధ్యత స్వీకరించి నిర్వర్తించలేదు. యినాందారింటున్నారు రైతు. రూరువులు ఊరువులు ఖర్చుతో వారికి నిమితం లేదు. పంటలు పండినా యెండినా తమ కవసరం. యిది పెద్ద వివాదగ్రస్తమైన సమస్య. దీనికితోడు రైతులపై కక్షతో తొలగింపు దావాలు

యీ చట్టం అమల్లోకి రాక పూర్వం పాత బకాయిలు డిక్రీ, అమలు జరుపరించి, చెల్లిస్తే గడ్డి కట్టనవసరం లేదు. చట్టం అమల్లోకి వచ్చిన తర్వాత యినాందారుకు గడ్డితో సహా యివ్వకోమని చట్టంలో ప్రభుత్వం వారి సెలవయింది. చట్టం రానప్పుడు కన్నా వచ్చిన తర్వాతే రైతుమీద భారం పెరుగుతోందన్న దివ్యం అవుతోంది.

రావలసిన బకాయిల చెల్లింపుకైనా వ్యవధి ఉంటుంది కాని, యీ చట్టం మేలు చేసే యినాం విషయంలో మాత్రం యెట్టి పరిస్థితులలోనూ రెండు మాసాలు మించిన వ్యవధి లేదు. అదైనా యినాందారు కోరిన మొత్తం చెల్లించేందుకే ఆ రేటు చట్టం అమల్లోకి వచ్చిన తర్వాత కూడా పెరగవచ్చు. ఆ పద్ధతిని ప్రభుత్వం నిరోధించలేదు. యింతకీ ఏకాలంలో రైతు శిస్తు బకాయిలు చెల్లించలేక పోతే యీ చట్టమే వర్తించదు.

యీ విధంగా రైతు రక్షణ చట్టం కొంత కన్నను రైతు రక్షణ కోసం 4 వాక్యాలున్నా, యినాందారుల రక్షణకోసం పేజీలు (187-190) 4 పేజీలున్నా ఉన్నాయి. యీ చట్టం వల్ల రైతుపొందిన హక్కులు హక్కులే. యినాందారులు కోరిన శిస్తులు బకాయిలతో సహా సకాలంలో కడుతూంటేనే అట్టివారికి యీ చట్టం 2 సంవత్సరాల రక్షణ కల్పిస్తుంది [illegible]

# వారఫలాలు

రావినూతల ఆంజనేయులు

ఆగస్టు 29 వ తేదీ మొదలు సెప్టెంబరు 4 వ తేదీ వరకు

గ్రహసంచారం

రవి, బుధులు (సింహం) కుజరాహువులు (ధనుస్సు) గురువు (మిథునం) శుక్రుడు 30 వరకు (కన్య) తరువాత శనితో (తుల) చంద్రుడు సింహ, కన్య, తుల వృశ్చికాలలో).

రాశ్యంతర గ్రహయోగములు

గ్రహసంచారము రాహు కేతుల మధ్య చరించుటచే కాలసర్పదోషము 29 శుక్ర గురు (కేంద్రం) 1 శుక్ర కేతు (యుతి) 3 బుధ గురు (త్రికోణం) 4 రవి రాహు (నవ పంచమం).

మార్కెట్లు (ధరలు) మార్పులు

జాతిల్లా (ప్రత్తి-నూలూ-వస్త్రాలూ

శని మకర నవాంశ సంచారం మార్కెట్టును తగ్గనివ్వదు. కాని వ్యాపారం చాల మందంగా నడుస్తుంది.

వెండి బంగారములు

13 లో తాత్కాలికంగా కొంత మందం వస్తుంది. స్వల్పలాభాలకు తృప్తిపడడం మంచిది.

ధాన్యములూ-ఇతర ఆహార వస్తువులు

గోధుమలూ, బియ్యమూ నిలకడగా యుంటవి. నూనెలు లెగ్గి వారాంతానికి మంల కొద్దిగా హెచ్చును.

విశేషములు

కాలసర్పదోషము ప్రపంచంలో అక్కడక్కడా తీవ్రపరిస్థితులను కలిగించును. ప్రజలు భయభ్రాంతులగుదురు. చోరభయమూ గోసప్రదవములూ భూకంపమూ, రైలు, విమానాది ప్రమాదములూ జరుగును.

మీ లగ్న (రాశి) ఫలం

మేషం (అశ్విని, భరణి, కృత్తిక 1-వ పాదం)

ఈ వారంలో గ్రహబలం లేదనియే చెప్పవచ్చు. కాని మీ రాశ్యధిపతి స్థితి మీకు కొంత విశ్రాంతి నివ్వగలదు. ఆరోగ్యం క్రిందటిలాగే యుంటుంది. కుటుంబ ఆర్థిక పరిస్థితులు విశ్రాంతి నివ్వవు. మిత్రులుకూడా మీకు సహాయపడలేని పరిస్థితుల్లో యుంటారు. సామాన్యంగా పనులలో నెరవేర్చుకోవచ్చును. ఉత్సాహంలేకున్నా ఉద్యోగులకు ఉల్లాసం.

వృషభం (కృత్తిక, 2,3,4 పాదాలు రోహిణి, మృగశిర 1, 2 పాదాలు)

ఈ వారంలో బుధ గురు శనులూ 30 వరకు శుక్రుడూ అనుకూలురు. జరుపదలచుకున్న శుభకార్య ప్రయత్నాలు అనుకూలంగా యుంటవి. కాని ప్రతిప్రయత్నంలోనూ కొంత ఆలస్యం జరుగుతునే యుంటుంది. వ్యాపారవృత్తులు వహిస్తున్నపుడు లేకుండా సాగుతవి. ఆరోగ్యం నిలకడగా యుంటుంది. కుటుంబంలోని ఆడువారివల్ల కొన్ని చిచ్చులు కలుగుతవి. 2, 3 న తీర్థయాత్రలకి, ప్రయాణాలకి, పెట్టుబడులకూ మంచిది.

మిథునం (మృగశిర 3, 4 పాదాలు ఆర్ద్ర, పునర్వసు 1 2 3 పాదాలు)

ఈ వారంలో రవి - శుక్రులు అనుకూలురు. ముఖ్యగ్రహసంచారం కొంత అనుకూలతను వ్యాపార వృత్తుల్లో చూపుతుంది. ఆరోగ్యం నిలకడగా యుంటుంది. ఉద్యోగస్థులకు మిత్రుల సహకారంతో అగిన కార్యక్రమం ముగించ కలుగుతారు. దూరంలో యుండే బంధుమిత్రులవద్దనుండి శుభవర్తమానాలు వస్తవి. బంధువులు రావడం వల్ల సుఖ సంతోషాలు పొందుతారు. 31, 1 లో శుభవార్తలు వింటారు.

కర్కాటకం (పునర్వసు 4 వ పాదం పుష్యమి, ఆశ్లేష)

ఈ వారంలో కుజ - శుక్ర రాహువులు అనుకూలురు. పరిస్థితులు వ్యాపారవృత్తుల్లో కొంత ఎగుడు దిగుడుగా యుంటవి. ఆరోగ్యంకూడా కొంత తగ్గుతుంది. ఇరుగు పొరుగువల్ల విశ్రాంతి యుండదు. సంఘంలో ఎగతాళి హేళనలకు గురియౌతారు. ఓర్పు అవసరం ఆస్తికి సంబంధించిన కోర్టు మొదలైన వ్యవహారాలు కొంత అనుకూలంగా యుంటవి. పెట్టుబడులు ఆపడం మంచిది.

సింహం (మఖ, పుబ్బ, ఉత్తర 1 వ పాదం)

ఈవారంలో గురు శుక్ర శనులు అనుకూలురు. పరిస్థితులు ఇంచుమించు గతవారంలోలాగే యుంటవి. ఆరోగ్యం నిలకడగాయుంటుంది. అప్పు చేసి ఇతరులకు చేసిన సహాయానికి విచారిస్తారు. కుటుంబంలో ఖర్చులు పెరిగినా సుఖముగా కాలం గడుపగలుగుతారు. శుభ పుణ్యకార్యాలు వెనుకబడును తీ.వి. సంఘంలో జాగ్రతను చూపవలసివస్తుంది. 1, 2, 3 ప్రయాణానికీ నూతనయత్నానికీ మిత్రులనూ అధికారులనూ కలవడానికి అనుకూలరోజులు.

కన్య (ఉత్తర 2, 3, 4 పాదాలు, హస్త, చిత్త 1, 2 పాదాలు)

ఈవారంలో శుక్రుడుమాత్రం అనుకూలుడు. ఉన్న గ్రహానుకూలతకూడా గొప్పదికాదు బంధుమిత్రులలో వైరభావాలు పెరుగుతవి. ఆస్తిసంపాదన ప్రయత్నాలకు విఘలం కలగడమే కాకుండా ఉన్న దానికికూడా ప్రమాదము అగపడుతుంది. ఆరోగ్యం తిన్నగాయుండదు. గౌరవానికిలోటుండదు. వారాంతంలో ప్రయాణానికి కొంత అనుకూలకాలం. శుభవార్త, మిత్ర సమాగమం.

తుల (చిత్త 3, 4 పాదాలు, స్వాతి విశాఖ 1, 2, 3పాదాలు)

ఈవారంలో రవి కుజ గురు శుక్ర రాహువులు అనుకూలురు. ప్రస్తుత గ్రహబలం మీకు అన్నిరంగాలలోనూ సహాయపడగలుగుతుంది. ఉద్యోగవృత్తుల్లో క్షేమ హెచ్చుగుంది. కాని ఉత్సాహంవల్ల గమనించరు. ఆరోగ్యం నిలకడగాయుంటుంది. శుభ పుణ్య కార్య ప్రయత్నాలకు ఆటంకాలు ఏర్పడుతవి. దూరంలో యున్న మిత్రుల ద్వారా తలపెట్టిన శుభకార్యాలు సాధించగలుగుతారు. 1 2 లో బంధువులను కలవడం. బిడ్డలవల్ల సంతోషం.

వృశ్చికం (విశాఖ 4 వ పాదం అనూరాధ, జ్యేష్ఠ)

ఈవారంలో రవి బుధ శుక్రులు అనుకూలురు. కుటుంబవిషయాలు మన స్థిమితాన్ని ఇవ్వవు ఎటూ లోటుండదు. కాని తృప్తి కలుగదు. కొన్ని వ్యవహారాలలో విసుకు విరక్తి కలుగుతుంది. ఇతరులకు సంబంధించిన వి బరుప్తైన వ్యవహారాలనూ పైన వేసికొనవద్దు. ప్రయాణాలు శ్రమలోకూడి యుండవు కుటుంబంలో వారాంతంలో అసంతృప్తికరమైన సంఘటనలు కలుగుతుంది.

ధనుస్సు (మూల, పూర్వాషాఢ ఉత్తరాషాఢ, 1 వ పాదం)

ఈ వారంలో గురు శుక్ర శనులు అనుకూలురు. మీ వ్యాపార వృత్తి ఉద్యమ పరిస్థితులు ఇంచుమించు గతవారంలో లాగే యుంటవి. ఆదాయం కొద్దిగా పెరుగుతుంది. మీ యొక్క సంఘంలో గౌరవమర్యాదలకు ద్వితీయ ప్రయత్నాలు చేసినా రుంటారు. కాని మీ మనశ్శాంతికి మాత్రం కొంతభంగం కలుగుతుంది. ప్రయాణాలు అగుతవి. 1.2 లలో బిడ్డలవల్ల సుఖ సంతోషాలు కలుగుతవి.

మకరం (ఉత్తరాషాఢ, 2, 3, 4 పాదాలు శ్రవణం ధనిష్ఠ 1,2 పాదాలు,

ఈవారంలో బుధుడూ 30 వరకు శుక్రుడూఅనుకూలురు. ప్రస్తుతం మీకు యోగకాలం. మీకు పైకి గ్రహబలం లేకపోయినా మీ రాశ్యధిపతిని బట్టి మీరు విహంగమూ లోటుకలుగకుండా జరుపుకొంటారు. ఆరోగ్యం కూడా మేలుగాయుంటుంది. వ్యాపార వృత్తుల్లో మిత్రుల సహాయం కలుగుతుంది. శుభ పుణ్య కార్యాలలో పనులు సుముఖంగా యుంటవి. వృత్తిలో ఆదాయంలో సంఘంలో హోదా పెరుగుతుంది. వారాంతంలో ప్రయాణానికి అనుకూలం.

కుంభం (ధనిష్ఠ 3, 4 పాదాలు, శతభిషం, పూర్వాభాద్ర 1, 2, 3 పాదాలు)

ఈవారంలో కుజ గురు శుక్రులు అనుకూలురు. అన్నీ తెలిసికూడా త్వరపడి చిక్కుల్లో తగులుకొనడం మీకు కలుగుతుంది. గ్రహబలం లేనప్పుడు అన్ని బాధ్యతగల (డబ్బుతో కూడిన) వ్యవహారాలకు దూరంగా యుండడం మంచిది. ఆర్థిక ఇబ్బందులు కలుగక మానసికవ్యథ కలుగుతుంది. విరక్తి కలిగించే ఆలోచనలు చేస్తారు. బంధువులవల్లా, మిత్రులవల్లా విసుగు కలుగుతుంది. 1-2 లలో ప్రియబంధు సమాగమం.

మీనం (పూర్వాభాద్ర 4 పాదం ఉత్తరాభాద్ర, రేవతి)

ఈ వారంలో రవి కుజ బుధులూ 30 నుండి శుక్రుడూ అనుకూలురు. అనేకరంగాలలో మీ పరిస్థితులు ముందుకు పోయి వెనుకకు నూయిగాయుంటాయి. ఇతరుల మాటలను నమ్మి మోసపోవడం కలుగుతుంది. గౌరవ మర్యాదలకు లోటు కలుగదు. సమయంలో మిత్రులు అకారణం కలిగించకలరు. ఆరోగ్యంకూడా తిన్నగా యుండదు. ఉద్యోగ వృత్తుల్లో అత్యంత జాగ్రత్త అవసరం.

